పురగిరి గ్రంథమాల.

సంపాదకుఁడు,

టి. సర్వారావు.

ప్రథమగ్రంథము.

# CHENDIKA.

# చండిక.



గ్రంథకర్త,

ముత్తనేని వేంకటచెన్నకేశవులు.

శ్రీ
రగిరి గ్రంథమాల.
ప్రథమ గ్రంథము.

సంపాదకుఁడు,
టి. సర్వారావు.
వీరభద్రపురం, రాజమండ్రి.

# చండిక.

ఇది

తులసీదేవి మున్నగు నాటకములు రచించిన

## ముత్తనేని వేంకట చెన్నకేశవులు చే

రచింపఁబడినది.



మొదటికూర్పు 1000 ప్రతులు.

దేశీయ విద్యాలయ ముద్రణాలయమున
ముద్రింపఁబడినది.
రాజమహేంద్రవరము.
1925



(ప్రతి వెల 1—0—0

# ఇందలి పాత్రములు

## పురుషులు.

గిరిరాజు—పురగిరిరాజు

ప్రచండుఁడు—గిరిరాజు తమ్ముఁడు కథానాయకుఁడు

ధీరమల్లుఁడు—గిరిరాజుమంత్రి.

రామమల్లుఁడు—మంత్రి భృత్యుఁడు

జగన్మల్లుఁడు } రాజభటులు
గుణమల్లుఁడు }

విదూషకుఁడు—రాజు వేడుక చెలికాఁడు.

విజయేంద్రమల్లుఁడు—గిరిరాజుకొడుకు

రాజేంద్రమల్లుఁడు—మంత్రిపుత్త్రుఁడు

ప్రతాపమల్లుఁడు—ఒక సేనాధిపతి, మంత్రికి హితుఁడు

వీరమల్లుఁడు—శ్రీనగరాధీశ్వరుఁడు.

సన్న్యాసి—ధీరమల్లుఁడు

భోజమల్లుఁడు—వేటకాఁడు

న్యాయాధిపతి

## స్త్రీలు.

చండిక—కథానాయిక

దేవి—గిరిరాజుభార్య

వీరపత్ని—మంత్రిభార్య

గంగ—ఒక దాసి

(ఇంకను భటులు వైద్యుఁడు సైనికులు దాసదాసీ జనములు వత్తురు.)

# ప్రకటన.

లిఖితరూపకమైన నాయనుమతి గొనక యెవ్వరు నీనాటకముఁ బ్రదర్శింపరాదు.

10—10—25 టి. సర్వారావు.

ఈపుస్తకము వలయువారు ఇట్లు వ్రాయవలెను.

టి. సర్వారావు.
వీరభద్రపురం, రాజమండ్రి.

# చండిక

## —: నాందీ :—

శా॥ శ్రీభాషాగిరిజాహ్యాదీశులుమదిన్ సేవింప, భావింప నెం
తో భక్తిన్ సుకవీశ్వరుల్ మునివరుల్, దుష్టాహితవ్రాతమున్
దాభంజించుచు, దాసకోటులపయార్ద్ర స్వాంతయైమించుచున్
సౌభాగ్యోన్నతి మీకుచండిక యొసఙ్ సభ్యాళికిన్ శ్రేయముల్.

(ప్రవేశము నాంద్యంతమున సూత్రధారుఁడు)

సూత్ర- ఏలయితివిస్తరము? సభ్యులార! నేఁడుమేము మీసాన్ని ధ్యమునఁ బ్రదర్శింపఁబోవు చండికానాటకము వ్రాసినకవి మీకుఁజిరపరిచితుఁడు. ఆకవిఁగూర్చి నుడువుమనుచుంటిరా? ఆలింపుఁడు.

సీ॥ సన్మల్లవాశాబ్ధి చంద్రుండు, పౌత్రుఁడ
సూర్యాదిలక్ష్మకి వేంకటసుబ్బనకును.
భూదేవికిన్నృసింహమూర్తికిఁబుత్రుండ.
వరమలహారదేవ చరణభక్తుఁ
డాగమవేదికి నాగేంద్రయోగికి
శింగరాఖ్యునకును శిష్యుఁడెంత
కున్ మున్నుఁదులసియన్ కొండొకనాటకం
బును వ్రాసిపేరును గొనినవాఁడు

ఆ॥ వె॥ అవనిముత్తనేని యనుగృహానామమ్ము
గలుగువాఁడు, వాసిఁ గన్నవాఁడు,
చెన్నకేశవుఁడు రచించెనిద్దాని,
సత్కవివ్రజమ్ము సంస్తుతింప

సరసకవితావిదులకు సభాసదులకు నతండిట్లు విన్నవించుకొను చున్నాఁడు.

ఆ॥ వె॥ చెలకునందురసముఁ జేకొంటఁబిప్పిని
బాఱవేయుచుంటఁ బలుకవలెనె?
గ్రంథమందు గుణము గలిగినఁ గైకొందు
విడుఁదుదోషమున్న విబుధులార

నేనింకనరిగి నాటక మారంభింపఁ జేసెదను.

(నిష్క్రమించు చున్నాఁడు)



# చండిక

## ప్రథమాంకము



(ప్రథమరంగము:—ప్రదేశము పురగిరి. చండికామందిరము.)

(ప్రవేశము చండికాప్రచండులు ఉచితాసనాసీనులై)

ప్రచం—ప్రాణప్రియా! చండికా! ఎందులకు నీమందస్మితసుందరవదనారవింద మింత కందువాఱినది? ఏకారణమ్మున నీమనోహరమధురాధర మింత శోభఁగోల్పోయినది? ఏకతమ్మున నీమనోజ్ఞ చంచలనేత్రములిట్లు గణఁతల నాశ్రయించినవి? హృదయేశ్వరీ! చెప్పరాదా! నావలననేమి పాపముగలిగెనో నీకేమి లోపముగలిగెనో వాక్రువ్వరాదా! మనోహారీ! చిబుకమంటి, చేతులఁబట్టుకొని, నిమనోనాధుఁడు నీప్రియుఁడు నీచరణసేవకుఁ డింతదీనతతో నింతెగాఁ బ్రార్థించుచుండ, నింత పెదవి విప్పి వచింపరాదా? ఇదినాకుఁ గావలయు, నదినీవు గొనిరావలయునని నీదాసునకాజ్ఞ యొసంగరాదా? మనసులోని మమత వెల్లడింపరాదా? ఈచింతయెందులకు? నాచెంత దాపఱికమెందులకు?

చ॥ వలచెదొ వజ్రహారముల? వాంఛవహించెదొ హేమభూషలన్?
వలిపెఁపుఁ బట్టుఁబుట్టముల వారక కోరెదొ? చెల్మికత్తెలన్
బలువుర నిచ్ఛగించెదవొ? వ్రాత్యమహీవరుకూర్మితమ్ము ము
ద్దుల రతనంపుఁ బేటిక! మఱో యెదఁగోరికఁ? జెప్పుమొప్పగన్

చండి—ప్రాణనాథా! మెడనిండఁ దగిలించుకొనుటకుఁ దట్టెడు సొమ్ములు లేవయ్యెనని తల్లడిల్లుటకు నేను గోమటి కొమ్మనుగాను. క్షత్త్రియకాంతను. క్షత్త్రియకాంతను సంతసింపఁజేయునదియా త్మేశ్వరునిదోస్సారముగాని ధనాగారముగాదు.

ప్రచం—అటులయిన మాత్రము నీకీ చింతయేల?

మ॥ కొంటిన్ బిర్దులఁబెక్కులాజి బలవద్ఘోరారులం గొట్టి, పై
కొంటిన్ బోరులఁబోరిపేరు విమతక్ష్మోణీశులంగట్టి, చే
కొంటిన్ గోటలుఁ బేటలున్ విభునకున్ గోట్లుద్ధతింబట్టి, వా
ల్గంటీ! యింతటిజెట్టి నీవరుఁడు! శోకంబంద నీకేటికిన్?
మఱియు.

సీ॥ ఎవ్వాండడుగుపెట్టజివ్వఁగలఁగిపోవుఁ?
గరివడ్డ సరసిజాకరము రీతి
ఎవనినీక్షించి శాత్రవకోటి కళవళ
పడు?1 భైరవింగన్న పక్షులట్లు
ఎవని గర్జకు రిపులవని వ్రాల్తురు దలల్?
నెమలి కూఁతకును సర్పములుఁ బోలె
ఏనిపాణిఁ గృపాణ మెసఁగ నెసఁ గుఁదోన?
పరుల ప్రాణముదండధరునిపాణి
గీ॥ అట్టిలోకత్రయీభీశ రాజిరంగ
సంగతప్రతిపక్ష రాట్ సైన్యనిచయ
చటులమదవిపాటనపటుస్ఫుటవిహార
ధూర్ధరునిముద్దుటిల్లాల! దుఃఖమేల!

1 డేగ గనుగొన్న—పా

చండి= ప్రాణేశ్వరా! సంతోషముకాని నామనవి నింత యాలింపుము కష్టపడి కాలికి గండపెండెరములఁ గట్టికొంటివిగాని శిరమునఁ గిరీటముఁ బెట్టుకొనలేదుగదా? సకలదిక్కులను జయస్తంభముల నాటించితివిగాని స్వాతంత్ర్యము స్థాపించుకొనలేదుగదా? రక్తసుధారవోసి రాష్ట్రములపై రాష్ట్రములు సంపాదించి రాజుగారి కర్పణముఁగావించితివిగాని స్వారాజ్యము సమార్జించి సార్వభౌముఁ డవుగాలేదుగదా? నీధైర్యమునీశౌర్యము నీస్థైర్యము నపుంసకుని కులటాభార్య తారుణ్యమువలెఁ బరులకుపయోగ పడుచున్నది గాని నీకుఁగాదు. ఏమిలోపమనుచుంటివా! లోపముగాక మనకున్న మహాభాగ్యములేమి?

సీ॥ పారతంత్ర్యమున లభ్యంబైన యన్నమ
  న్నంబౌనె? పాడునున్నంబుగాక?
సేవకవృత్తినిఁ జేరుజీలుఁగువల్వ
  వల్వయే? పెనుగొండ చిల్వగాక!
బానిసతనమున లోనైనగృహము గృ
  హంబౌనె? యుగ్రగ్రహంబుగాక!
భృత్యత్వమునను లభించుభోగంబు భో
  గంబౌనె? ఘోరరోగంబుగాక!

గీ॥ పారతంత్ర్యమ్ముకన్నను నారకంబు
సేవకత్వమ్ముకన్నను జెడ్డచేటు
బానిసతనమ్ముకన్నను బాపఫలము
గట్ట! భృత్యత్వమునకన్నఁ గష్టమున్నె?

ప్రచం—ఏమోచదువుచుంటివి? అయిననీకుఁబారతంత్ర్యమేమి?

చం—భర్తకుఁ బారతంత్ర్యమైన భార్యకుఁ గాదా?

ప్రచం——నాకా పారతంత్ర్యము! అబ్బ! ఎందులకీ వెఱ్ఱి! ఈ రాజ్య మెవ్వరిది? ఒరులదిగాదే! మదగ్రజునిదే! అదియు నతని స్వార్జితమా పైతృకము. నాకునంతియు. పైతృక మనుభవించుటలోఁ బారతంత్ర్య మేమి?

చండి——పైతృకము నీవనుభవించుట లేదు. నీవనుభవించునది నీచ దాస్యము! ఎంగిలి గంజి! రాజ్యము ననుభవింపనోఁచినవాఁడు నీయగ్రజుఁడు. గిరిరాజు. నీవీపురగిరిరాజ్యరమావరుండవు గావు. అతని కనుసన్నల ననుసరింపఁదగిన యధమ సేవకుఁడవు. కాదు! అతని సేవకులందఱిలో నగ్రగణ్యుఁడవు. అనఁగా సేనాధీశుఁడవు. అంతేసుమా! పాపము; పైతృకమని పరమానంద భరితుండ వగుచుంటివిగాఁబోలు. ప్రాణేశ్వరా! నీ వెంతటియమాయకుండవు? ముచ్చిబంగారపు నగలు పెట్టుకొని మురిసిపడు వీధి యాటగాండ్ర విధమున నీయధ్వాన్నపుటాభరణములు ధరించుకొని మనము కులుకవలయునా? చిలుక కొఱికిన పండ్లుమఱింత మధురముగా నుండునని తెగఁ దినుతిండిపోతులరీతి, నీ యెంగిలిపరమాన్నముఁ గుత్తుక బంటి మెక్కి మనము నిక్కిపడవలయునా? చల్లగానుండునని పాడుబురద మడువులలోఁ బడి పొరలాడు నీచవరాహమ్ములవలె మెత్తగా నుండునని యీ పాపంపుఁ బూసెజ్జలపైఁబడి మన మొడలుమఱచి నిద్రింపవలయునా? నాథా! ఇవి మణిహారములుగావు. ఫణివారములు-ఇదివీడుకాదు. వల్లకాడు.

ప్రచం——చండికా! ఇంతకేమి చేయుమనెదవు?

చండి——చేతగానిచోఁ జేయునదేమున్నది?

ప్రచం—— (మీసము మెలిబెట్టుచు) ఏమి! చేతగానివాఁడా ప్రచండుఁడు?

చండి——చేతనైన జెట్టియే కావచ్చును. కాని విడ్డుకోవలసినది మీాసముగాదు. రోసము.

గీ॥ పురుషులకు వాసిఁగలిగింపఁ బోలునద్ది
చండిమయగాని మీాసాల దండిగాదు
సకియలకు వన్నెఘటియింపఁ జాలునద్ది
శీలమేగాని పాలిండ్ల చెలువుగాదు.

ప్రచం——మనోహారీ! చండికా! మోహాతిరేకమ్మునఁ బురుషులు దమకుఁ బరమవిధేయులై యున్నంత మాత్రమున నింతగా నోనాడుట నిను బోటిశీలవతులకు నీతిగాదు.

చండి——ఏమి? ఉచితకార్యపరాఙ్ముఖుండగు పిఱికి మగనిఁబరుష వాక్యములఁ బరిభవించి కార్యోన్ముఖుని గావించుట పరమాభిజాత్య సంపన్నయగు పవిత్రక్షత్రియ కాంతకు ధర్మువుగాదా?

ప్రచం——పిఱికిమగఁడా ప్రచండుఁడు! ఔరా!

ఉ॥ భండనభూమి ఘోరరణ పాండితికిన్ మదిమెచ్చి, నిచ్చలున్
గండరగండఁడంచు రిపుకాండము లెవ్వనిఁ బ్రస్తుతించుఁ? ద
చ్చండపరాక్రమక్రముఁ బ్రచండుని నేఁటికిబోటియోర్తు హా!
చండిమలేని పందయని సారెకుదూరెదు నేమిచిత్రమో!

చండి——నీకుఁ జండిమలేదనికాదు. శక్తిలేదనికాదు. ఉన్నది. కాని యున్నందులకు లవమైన లాభములేదయ్యెనని——మఱియుఁ దేజోనిధియగు రాజాత్మజునకు సాజముగ నుండవలసిన సామ్రాజ్యకాంక్ష నీకు రవ్వంతయులేదయ్యెనని——పరమాభిమానధనుఁడగు ధరణీశ్వర నందనునకు సహజముగనుండఁదగిన స్వాతంత్ర్యాపేక్ష నీకునివ్వరిముల్లంతయు లేదయ్యెనని——బలపరాక్రమసంపన్నుడగు ప్రభుకుమారకునకుఁ బుట్టుకతో నుండవలసిన పారతంత్ర్య పరాఙ్ముఖత్వము నీకిసుమంతయు

లేదయ్యెనని—సదమలక్షత్త్రియవంశసంజాతునకు జన్మముతోనుండఁదగిన సాహసిక్యమునీ కొంతయు లేదయ్యెనని—సామర్థ్య మున్నను సామ్రాజ్యము లేదయ్యెనని—

ప్రచం—పట్టమహిషిం జేయఁదగిన పరమాభిజాత్యసంపన్నను, స్వాతంత్ర్యమంటప ప్రదీపికయగు చండికను బ్రభ్విం జేయలేదేయని— ఆమాటఁ జెప్పమఱచితివేమి?

చండి—ఏమి? నన్ను బ్రభ్విని జేయవైతివనియా నాకేచింత? నాకీవలవంత! కాదుసుమా! ఆదైవముపై, నాదైవమవగు నీపైఁ బ్రమాణముఁ జేసి చెప్పుచుంటిని. నాకట్టియాసలేదు. లేదు. రాజరాజవై భూజనమ్ముల నెల్లఁ గటాక్షముల నాటాడింపఁ దగిన దక్షుఁడవు నీవొక నీచాధముని యడుగుజాడలఁబడి నడచుకొనుచుండఁ జూచి సహింపలేక, చక్రవర్తివై సంశ్రితజనమ్ముల పాలి కల్పవృక్షమవై యశోనిధివై యొసంగఁ దగిన సమర్థుఁడవు నీవొక హీనుఁడింత పెట్టువఱకు నట్టె నోరుతెఱచుకొని మిడుకుచుండవలసివచ్చెనే యని మనసుఁ బట్టఁజాలక, సార్వభౌముండవై సర్వసామంతజన మస్తకప్రదేశములఁ బ్రకాశింపఁదగినధీరుఁడవు నీవొక పందకాలిక్రిందఁబడి కాలము గడపుకొనుచుండ వలసివచ్చెనే యని యవమానము భరింపనోపక నేనిట్లు వాపోవుచుంటిని. పురగిరిరాజ్య సింహాసనము నలంకరించి నిండుకొలువై నీవుండఁగనులపండువుగఁ గాంచి సంతసింపవలయుననియే గాని నేనుఁ బ్రభ్వినై యెగిరిపడవలయునని కాదు. నేనుఁ బట్టమహాదేవిని గానక్కఱలేదు. నేను బానిసనై యున్నను నాకుఁజింత లేదు. నాకుఁ గావలసినది నానాథుఁడు జగతీనాథుఁడగుటయే. ఆవలవంతదక్క నాకు వేఱుచింత లేదు. లేదు. హృదయేశ్వరా! నీచరణసాక్షి! నాకా చింత లేదు.

ప్రచం——జీవి తేశ్వరి! నీహృదయ మెట్టిదో నీహృదయేశ్వరుఁడే యెఱుంగఁడా? నాస్వాతంత్ర్యము కొఱకే——నా సౌఖ్యముకొఱకే——నీవు సంతతము చింతించుచుందువు.

చండి——ప్రాణనాథా! పారతంత్ర్యముకన్న ఘోరనరకము, స్వాతంత్ర్యమునకన్న స్వర్గలోకము, మఱియొకటి లేదని మదభిప్రాయము. పరతంత్రునకు సౌఖ్యమెచ్చటిది?

సీ॥ గంగిరెద్దులవాఁడు గడఁక మూఁదాడ్వోసి
యెగిరింప నెగిరెడు నెద్దువోలె
కోఁతులవాఁడిడు కోలను గేలను
గొని షికారునొనర్చు కోతిరీతి
అహితుండికుఁడు బుట్ట యందిడినాగస్వ
రంబూఁద నాడు సర్పమ్ముగతిని.
పంజరంబునఁ నిడి పలుగాకులలయించి
పలికింపఁబలికెడు చిలుకభంగి.

గీ॥ అధిపునాజ్ఞలఁ దలఁదాల్చి, యధిపుకత్తిఁ
బట్టి, యధిపు మాటలఁజెవిఁ బెట్టియధిపు
నుడులె నుడువుచు బ్రదుకును గడపుకొనెడు
నధమభృత్యునకున్ సౌఖ్య మన్నదున్నె?

తలయూఁపు బసవన్నయన్నఁ దలయూఁపవలయు. తిరుగుతిమ్మన్నయన్నఁ దిరుగవలయు. ఆడునాగన్నయన్న నాడవలయు. పలుకు రామన్నయన్నఁబలుకవలయు ఇట్టిపాపంపుబ్రతుకు,ఇట్టినికృష్టంపుబ్రతుకు బ్రదికిననేమి? బ్రదుకకున్ననేమి? కాన మానవుఁడు–

గీ॥ భృత్యుఁడై వేలయేండ్లు జీవించుకన్న
మహి స్వతంత్రుఁడై యొకయేఁడు మనుట మేలు.

పందియై పదియేడులు బ్రదుకుకన్న
నందియై నాలు గేఁడులుంటయె ఘనమ్ము.

ప్రచం—అతివా! అస్వతంత్రతయన్న నాకు నసహ్యమె స్వాతంత్ర్యమన్న సంతోషమే కాని యేమి చేయవలయు? దైవమునకు దయ లేదు.

చండి—దైవమునకు దయ లేదా! మానవుని పుట్టిలో మదిమున్న దైవమునకు దయ లేక పోవునా! గంజియో కలియో కంఠదఘ్నముగఁ దాగి కాలు సేతులు గదల్పక యింటఁ గూర్చుండి దైవమునకు దయ లేదయ్యె రాజ్యము రాదయ్యెనని కన్నీళ్ళు గార్చినంత మాత్రమున రాజ్యముఁ జేతిలో రాలిపడును గాఁబోలు?

గీ॥ నరుఁడు వొనరించు యత్నమ్మునకు ఫలమ్ము
దానొసంగుటకే కర్త దైవమైన
ఇంటఁబండి దేవుఁడు పెట్టఁ డేయటన్న
గూడుగొనివచ్చి నోటిలో గ్రుక్కఁబోఁడు

ప్రయత్నమునఁగాని ఫలము చేకూరదు.

శా. ప్రాణంగూర్చి రకృపాణిఁబూని, బలవత్ప్రత్యర్థిభూభృద్భట
శ్రేణిందాఁకి యసృక్ప్రవం బరల నుర్విం గార్చినం గాక, యీ
క్షోణీ రాజ్యము శూర భోజ్యమెటు వచ్చుంగా ముండలట్టింట్లలోఁ
బ్రాణాశంబడి వేఁడి యశ్రువులఁ గార్పంగా క్షత్రియాగ్రామణీ.

ప్రచం—చండికా! నీ కఠోర వాక్యముల నేను వినఁజాలకుంటిని

చండి—నీ యసమర్థ వాక్యములు నేను వినఁజాలకుంటిని; నీ పిరికితనము నేను సహింపలేకుంటిని. నీ బానిసతనము నేనుఁ జూడలేక పోవుచుంటిని—నీ హైన్యము నేను భరింప నోపకుంటిని

ప్రచం—భరింపలేకున్న పారతంత్ర్యశృంఖలా విచ్ఛేదమునకు మార్గముఁ జెప్పుము—

చండి—మార్గము లనేకములు.

ప్రచం—నాకేమార్గముగనిపించుట లేదు.

చండి—నీయొజలోనున్నది.

ప్రచం—కజవాలు

చండి—ఇంక నేమి?

ప్రచం—దానితో నేమికాఁగలదు.

చండి—ఏది తలంచిన నది

ప్రచం—ఎట్లు?

చండి—వైరికంఠచ్ఛేదన మెట్టులో వీరునకుఁ జెప్పనదియేమి?

ప్రచం—ప్రాణేశ్వరీ! అట్లుకాదు.

ఉ॥ సైంధవకోటులున్ సుభటసంఘము స్యందనసంచయంబులున్
గంధగజేంద్ర బృందములు గల్గుమదాంధుల, ఘోరదోర్బల
గ్రంధులవైరులంగెలిచి రాజ్యమువొందుట యెట్టులొక్కఁడన్
సింధుర యాన! యేకరణిఁ జీమయొకండు దరించు సంద్రమున్?

చండి—చతురంగ బలములులేక శత్రునిబర్హణ మెటులని

జంకుచుంటివా?

గీ॥ శాత్రవాళిఁ గెలువఁ జతురంగబలములే
గలుగునేనిఁ గేలఁ గత్తిఁదాల్చు
పురుషవర్యుఁ డేల? పోలదే కేలగా
జులధరించుకొన్న కలికిమిన్న.

అదియునుగాక

కం॥ కరులున్ హరులున్ దేరులు
వరవీరులు నేలవైరి వర్గముఁగెలువన్,

గురుతర బుద్ధిబలంబే
పురుషునకున్ జయముఁ గూర్పఁ బోలున్ జుమ్మీ

ప్రచం——చండికా! బుద్ధిబలమునాకు లేదు. ఉన్న దానవునీవే యుపాయ మెఱింగింపుము

చండి——ఉపాయ మేమున్నది? గిరిరాజుశిరము నఱికివేయుము

ప్రచం——హరహర! పితృప్రతిమానుఁడగు నగ్రజుని, దైవ సమానుఁడగు నగ్రజన్ముని, నాప్రభుఁడు నాస్వామి నారక్షకుఁడు నగు నన్నను వధించి రాచతెకము నేను వెలుఁగఁబెట్టనా? మలహరదేవా! మలహరదేవా!

సీ॥ చిన్ననాఁటంగోలెఁ గన్నతండ్రియుఁబోలెఁ
గన్నులననుఁబెట్టి కాచినాఁడు
విద్దెలనేర్పించి బుద్ధులఁ గఱపించి
పెంచినన్ బెద్దఁ గావించినాఁడు
నేఁగోరుకామినినిభ రాజగామిని
జాసినిన్ బెండిలిఁజేసినాఁడు
తప్పుఁజేసిననైనదండింపఁ దలఁపూన
కించువేడుకనాదరించినాఁడు

గీ॥ తల్లి దైవతమ్ముదానయై నిరతమ్ము
మెచ్చినాఁడు సిరులనిచ్చినాఁడు
కలికిమిన్నయట్టికరుణానిలయు నన్ను
నెట్టుచంపువాఁడు గట్టివీఁడు!

చండి——ఎట్టులా! కత్తితో

ప్రచం——ప్రాణప్రియా! చండికా! ఏపాపమెఱుంగని నన్నీ మహాపాప కూపంబున నెందులకుఁ బడవైచెదవు?

ఉ॥ భూతల పారిజాతమును, బూతచరిత్రునిఁ బుణ్యమూర్తి, మ
 ద్భ్రాతవధించి, తత్సతినిఁ బావనశీలఁ బతివ్రతామణిన్
 గోతిని డించి, పాపనికి గోడును బెంచి, కలంచి సజ్జన
 వ్రాతము, న్మాతలం బెటులు పాలన సేయుదు రోయి లోకముల్

చండి—భ్రాతృవధ పాపప్రదము వరులకుఁగాని పరాక్రమైకధనుఁడగు ప్రభు కుమారునకుఁ గాదు. శూరకర్మమట్టిది. వీరధర్మమట్టిది.

ఉ॥ పాండవులల్ల కౌరవులు భ్రాతలుఁ దమ్ములుగారె భూమికై
 యొండొరు గండడంపఁదలఁపూనరె భండనమున్ బొనర్పరే
 పాండుతనూజులాజిని విపక్షులదక్షతనొంచి ధారుణీ
 మండలమేలు వో సుజనమండలిరోసెనె? నింద సేసెనే?

ప్రచం—చండికా! తలరాయిఁజేసికొని నాయగ్రజునిశిరము ఖండింతును అంతమాత్రమున నీరాజ్యమునాకెట్లు లభించును?

చండి—ఏమి?

ప్రచం—ఆయుష్మంతుఁడు మదగ్రజునికుమారుఁడు విజయేంద్ర మల్లుఁడు లేఁడా! అతఁడుండ నేను సింహాసనమెక్కిన మంత్రులు సహింతురా!

చండి—గుడిమ్రింగినవానికి గుడిలోనిలింగ మెంతటిది?

ప్రచం—హా! ఆబాలపావని కుత్తుకఁగూడఁ గొఱగోయఁ గోయ వలయునా?

చండి—నీవాపనిఁ జేయనక్కఱలేదు. నీవీపనిఁజేసిన ధీరమల్లాదులు వానిపేర నతఁడు పెద్దయగువఱకు రాజ్యమునిన్నేలుమని యెదరు. వారంగీకరింపకున్నను, నీవు సేనాధీశ్వరుఁడవు గావున బలవంతముననైన జనులమెప్పునకుఁ గొన్నాళ్లవఱకు రాజప్రతినిధివై రాజ్యముఁ జేయ వచ్చును పిమ్మటనేదో మార్గముఁ యోజించుకొనవచ్చును

ప్రచం—ఇంక వేఱేమార్గమేమి? వానిగూడఁ బొట్టఁబెట్టు కొనుటయే

చండి—అన్నమాటయే

ప్రచం—అగ్రజునిఁ జంపుట జనులెఱింగిన నన్ను రాజ్యము నేల నిత్తురా? ధీరమల్లాదుల నేలుమందురు

చండి—జనులెఱుంగ కుండనే చంపవలయును

ప్రచం—ఎట్లు?

చండి—దేవీనవరాత్రములుగదా యివి? ఈదినములలో బ్రత్యర్ధరాత్రమున నీయగ్రజుఁడొక్కఁడే దేవ్యాలయమునకుఁ బూజకొఱకుఁ బోవుచుండును. ఆతఁడు నిష్ఠతో శక్తిని బూజించుసమయమున రహస్యముగా నతని మడియింపవచ్చును

చండి—హా! ఈ యకార్యకరణము జగజ్జనయిత్రియు సకలలోకాధిష్ఠాత్రియు నగు చండికాదేవి చరణసాన్నిధ్యముననా?

చండి—చండికకు భక్తికన్న రక్తమెక్కువ ప్రియకరము.

ప్రచం—(ఆత్మగతము) ఈ చండికకు అంతకన్నఁబ్రియకరము

చండి—నీవట్లు లొనర్చిన దేవి నీయందనుగ్రహముజూపును.

ప్రచం—చూపవచ్చును. (ఆలోచించుచుండును)

చండి—ఆలోచించుచుంటివేమి?

ప్రచం—ఏమియు లేదు.

చండి—తప్పక ఈ కార్యమొనర్తువా?

ప్రచం—అట్లడుగుచుంటి వేమి?

చండి—అడుగడుగునకు వెనుకంజ నిడు నీవాకార్యమొనర్పలేవే మోయని

ప్రిచం—నాకేమియు సందేహాము లేదు. ఇంక నీ నాథుఁడు భూనాథుఁడయ్యెననుకొనుము. చింతదక్కి యింకనైన సంతోషముగా నుండుము.

చండి—నామనోరమణుఁడు పురగిరి రాజ్యకుమారమణీరమణుం డగు వఱకు నాకు సంతోషమెక్కడిది ?

ప్రిచం—ఓ బేలా ! నీకేల సందేహాము ? ఇటు వినుము.

సీ. గోహత్యఁ గావించు క్రూరచండాలుండు
గురుసతి గవిసిన కుటిలబుద్ధి
పోషించుస్వామిని బోకార్చిన ఖలుండు
మాతఁ గాలం దన్ను ఘాతుకుండు
జన్మభూమికి నెగ్గుఁ దలపెడు చెన్నంటి
బాపులఁబూడ్పించు పాపకర్ముఁ
డాహవంబున వెనుకంజవేయు జనుండు
శరణన్న పగతునిఁ జంపునీచుఁ

గీ. డెట్టిఘోరాఘమున్ గాంతు రట్టిపాప
మేఁ గనెదఁగాక భూపువధింపనేని
నాగుఁడుసాక్షి యిందులకు శ్రీవరుఁడుసాక్షి
అంబుజాక్షి నీపాదయుగ్మంబుసాక్షి.

చండి—ఎప్పుడు?

ప్రిచం—నేఁడు పొద్దు గ్రుంకనిమ్ము

చండి—(సంతోషముతో)మనోరమణా! నీవందులకుఁ దగుదువు (చెంతకుఁబోవును)

ప్రిచం—ఎందులకు నీయాలింగనమునకా?

(యవనిక జాఱును)

## ద్వితీయరంగము

ప్రవేశము దేవాలయమునకు ముందటి స్థలము

(ప్రవేశము ఖడ్గహస్తుఁడై జగన్మల్లుఁడు.)

జగ—(ఆత్మగతము)

దేవీ నవరాత్రములలో నిదియైదవ దినము. ఈరాత్రికూడఁ జల్లఁగఁగడచెనా! మహారాజుగారి పూజ మఱినాల్గురాత్రులు. చండికానుగ్రహమునఁ బ్రభుచంద్రునకు నెట్టి కీడును గలుగదు. ధీరమల్లుఁ డెందులకైన మంచిదని నన్నురహస్యముగఁ గావలియుంచెఁగాని గండరగండండును వైరిలోకదండధరుండును బ్రచండ శాసనుండును నగు గిరిరాజరాజశేఖరునిఁ దేఱి చూచువారెవ్వరు? (నేపథ్యమున గంటచప్పుడువినఁబడును.) పండ్రెండ్రుగంట లైనది. మహారాజిప్పుడు పూజాద్రవ్యములతో దేవిని బూజింపవచ్చును. ఇందున్నఁ గనంబడిన నెట్టిమాటవచ్చునో? ఆచెట్టు క్రీనీడను నిలిచియుండి కనిపెట్టుచుండెదను.

(ప్రక్కకుఁ బోవును.)

(పూజా ద్రవ్యములతో నిండియున్న బంగరుపళ్లెరమును జేఁదాల్చి గిరిరాజు ప్రవేశించి యాలయములోనికిఁ బోవును)

ప్రచం—(ముసుఁగు వెట్టుకొని ప్రవేశించి) అగ్రజుఁ డిప్పుడేగదా యాలయములోనికేఁగెను? కొంతవఱకు సింహద్వారముకడ నిలువఁబడి యుండి పిమ్మటఁ గర్తవ్యమునకుఁ గడంగెదను. (నిష్క్రమించును)

జగన్మ—(వెంటనే ప్రవేశించి) వీఁడెవ్వఁడు? వీనికిక్కడ నేమిపని? వచ్చి సింహద్వారముకడ నిలువబడెనేమి? మహారాజ రక్షణార్థమై వీని గూడ మంత్రిచంద్రుఁడంపియుండునా? నేనుండ వీనినేల పంపును? లేక దేవిగారంపిరా? ఏమియుఁదోఁపదు వీఁడుహితుఁడో? అహితుఁడో? ఏమైనఁగానిమ్ము. ఏఁగక నిలిచియున్న నేనిందే నిలిచియుండెదను

లోనికేఁగిన సేన నేఁగెను (కఱవాలుఁ జేఁబట్టి ఆవంకకుఁ జూచుచు నిలిచియుండును)

చండి—(వెనుకనుండి మెల్లఁగఁ బురుషవేషముతోఁ బ్రవేశించి) వీఁడెవ్వఁడు? నానాథుఁడు వచ్చినవెంటనే ఎక్కడనో నక్కియుండి ఈవలకువచ్చి ఆవంకనే చూచుచున్నాఁడు. ఛీవికారులఁడగు ధీరమల్లుఁడు వీనిఁగావలియుంచెఁగాఁబోలు అదిగో వీనిచేత ఁగత్తియు నున్నట్లున్నది. ఇంక నాలసింపరాదు కిక్కురుమనకుండ వీనికంఠము నెగురవేయవలయు. (ఒఱనుండి కఱవాలు వెడలిజగన్మల్లుని కంఠము దెగవ్రేయుచున్నది)

జగన్మ—(పడిపోవును)

చండి—(కఱవాలునొఱలో నిడి) వాఁడుగో నాథుఁడులోనికిఁ బోవుచున్నాఁడు. నేనుం బోయి కర్తవ్యమునకుఁ గడంగునో లేదో కని పెట్టుచుండెద. (నిష్క్రమించును)

(ప్రవేశము గుణమల్లుఁడు)

గుణ—(చిన్నయెలుఁగున) జగన్మల్లుఁడా! జగన్మమల్లుఁడా! ఏఁడీ! కనఁబడఁడయ్యె నేమి? మహారాజ సంరక్షణార్థము వానిఁబంపితి. అతఁడు జాగ్రదవస్థలోనుండెనో లేదో చూచిరమ్మని గదా యమాత్యుఁడు నన్నంపె. ఏమని జెప్పుదును? (కాలునకు జగన్మల్లుని మృతకళేబరము దగుల నులికిపడి) ఓహో! ఇదియేమి? (కూర్చుండి తడవి చూచి) హా! మొండెము! ఈపొడవు నీలావును బట్టిచూడ నిది జగన్మల్లుని శవముగాఁ దోఁచుచున్నది ఇంక నిందునిలువరాదు ఎవ్వరో శత్రువులు వచ్చిరి. మహారాజునకు ఎమిచేటు మూడెనో లోనికిఁబోయి యరయుదునా? జగన్మల్లుని చంపిన వాఁడి నేనెంత? కార్యము చెడును. పోయి మంత్రికిఁ జెప్పి తగిన సైన్యముతో వత్తును.

(నిష్క్రమించును)

## తృతీయ రంగము

## ప్రదేశము. ఆలయము

(ప్రవేశము. దేవి కెదురుగఁ గూర్చుండి గిరిరాజు)

(ఒకప్రక్క ఖడ్గపాణియై ప్రచండుఁడు—ఒకరహస్యస్థలమున నిలిచిచండిక. దేవిసన్నిధిని దీపము వెలుఁగుచుండును)

ప్రచం—(ఆత్మగతము) మహారాజు చండికాధ్యాననిష్ఠా గరిష్ఠుఁడై యున్నవాఁడు ఇట్టిసమయమున నితనిన్ గడతేర్చుట కడుంగడు సులభము (పరిక్రమించి కఱవాలునెత్తి సంశయించి) హా! ఏమి చేయఁబోవుచుంటిని? ఈమహారాజును- ఈకలియుగ ధర్మరాజును- ఈ కరుణానిధిని- ఈవాత్సల్యభాజనుని-ఈభూలోక కల్పవృక్షమును-ఈబంధు జనమందారమును- ఈపవిత్రక్షత్రియశిరోభూషణుని ఈపురగిరి రాజ్య రమాధురంధరుని- ఈచండికాచరణభక్తుని- ఈదీనజనావనాసక్తుని- ఈసద్గుణ జాలుని- ఈసత్యశీలుని-జంపబోవుచుంటినా? ఎందులకు! నా కితఁడేమి యపకారము సల్పె? ఏలోపముగావించె? పలుగుఁ జెయిదములఁ జలిపిననైనఁ బల్లెత్తు మాటాడి యెఱుంగఁడే? ఎట్టిబెట్టిదపుఁదప్పు జేసిన నయిన నిట్టులేమని పృచ్ఛించి యెఱుంగఁడే? కరుణాదృష్టులఁబఱపుట యే గాని ఏక్షణమున నయిన గోపదృష్టులఁ జూడఁడే? తండ్రివోయిన నాఁటంగోలె దనయునిం బోలె మన్నించెఁగాని వేఱుగాఁదలఁపడే? అడుగుటయె తడవుగ నఖిలమ్ము సమకూర్చునే? ఇట్టిప్రభుసత్తముని ఇట్టి సుజనోత్తముని, ఇట్టి తండ్రిని, ఇట్టి స్వామిని, ఇట్టి వాత్సల్య నిధానమును ఏమని చంపుదు? ఎట్లు మనస్సు రాయిచేసికొందు? ఏదిదారి?

సీ. ధరణీశుతలఁగోసి తత్ కిరీటముఁదీసి
యేశిరమ్మునధరియింప వలెనె?
క్షితినాథుమత్స్వామిఁ జితిపైని నెక్కించి
యేనుసింహాసన మెక్కవలెనె?
వసుధేశ్వరు శ్మశానవాటికకుం బంపి
యేవంతిపురియందు నెసఁగవలెనె?
పరివారు నగ్రజు నక్కలపాల్ చేసి
క్షోణినా పాల్ చేసికొనఁగవలెనె?

గీ. శాశ్వతము గాద యేదియు నశ్వరంబ
యట్టిచో నెట్లు చంపుదు నగ్రజన్ము
పుడమి నేని శిరము నేలఁబడిన యంతఁ
బడక యుండునె నానెత్తిపైని పిడుగు?

అక్కటక్కటా! ఒకతల్లి గర్భమున జన్మించి, ఒకచంటిపాలు ద్రావి, ఒక కంచమున భుజియించి, ఒకసెజ్జ శయనించి, ఒక్కగురుని చెంగజదివి, ఒక్కవాడ నాడి, ఒక్కచోఁబాడి, నేటికనెత్తురు కూటికై తినకుడి భుజమును డానుఖండించినట్లు, తిన్నయింటివాసములులెక్కించి నట్లు, తల్లికొమ్ము గుద్దినట్లు, అన్నముపెట్టినవానికి సున్నముఁబెట్టినట్లు నాయగ్రజన్ముని నేనై వధింపనా? ఏమైనఁగానిమ్ము. చండిక విషముద్రావనిమ్ము, ఉరిపెట్టికొనిచావనిమ్ము, మనోవ్యథతో మండిపోనిమ్ము, అదిపోయిన నింకొకతె వచ్చును అగ్రజుఁడెట్లువచ్చును? ఈ కల్మషకార్యము, ఈ ఘాతుకకృత్యము నేనొనర్పజాలను జగజ్జననులీరి చండికా!

గీ. ఆడుదాని మాటలువిని యనదవోలె
ద్వ్యచ్చరణ భక్తిఁబాలియింపఁ దరలివచ్చి
నీపవిత్రభావమ్మునం జేసి నీతిఁదెలసి
తిరిగి పోయెద క్షమియింపు దేవినన్ను

తల్లీ ! భక్తలోక కల్పవల్లీ !

గీ. నన్నుఁబోలు పాపాత్ము లెందఱు గడంగ
నన్నవారో ఈమహానీయు మన్నె గొనఁగ
వారిబుద్ధుల మఱలించి భూరికరుణ
సంతతముఁ బ్రోవు నాయుగ్రజన్ము తల్లి !

అమ్మా నాకింక సెలవో స్వగృహమునేఁబోయివచ్చెద.

(పరిక్రమించుచున్నాడు.)

చండిక—(తటాలున బ్రచండున కెదురువచ్చి)·(అపవారించి) ఎక్కడకుఁ బోయెదవు?

ప్రిచం—ఓసీ!నీవెట్లు వచ్చితివి? ఎందులకు వచ్చితివి?

చండిక—(అపవారించి) నీకెటులైన నీపనిఁ జేతగాదని

ప్రిచం—నిశ్చయముగ నీపనినాకుఁ జేతకాదు

చండిక—మంచిది. ఇంకనిచ్చట నీవెందులకు? నడువుము

ప్రిచం—నీవుమాత్ర మెందులకు?

చండిక—ఈమాత్రపుఁబనినాకును జేతకాదను కొనుచుంటివా?

ప్రిచం—ఏమి!పిశాచీనా యుగ్రజని, నీవుచంపెదవా?

చండిక—పాపము ఆఁడుదాని చేతిలో నగ్రజన్ముఁడు చావ వలసివచ్చెనేయని చింతపడుచుంటివా? ఏమియింత సమర్థుఁడగు తమ్ముఁడున్నందులకు నతనికిఁదగిన ప్రాయశ్చిత్తమే జరుగనున్నది

ప్రిచం—ఛీ! ఆఁడుదాని చేతిలోఁజచ్చు కర్మమెందులకు! నా యుగ్రజన్ముని నేనేచంపెదను నీకావలకుఁబొమ్ము

చండిక—నీవాపనిఁ గానిమ్ము (ప్రక్కకుఁబోవును)

ప్రచం—(పరిక్రమించి గిరిరాజును జంపుటకు సిద్ధమగును)

(నేపథ్యమున సందడి)

చండిక—(ఆత్మగతము) ఓహాహా! ఆవల నేమొసం దడివినఁబడుచున్నది? పోయిచూచివచ్చెద (నిష్క్రమించును)

ప్రచం—(గిరిరాజుశిరము నఱకఁబోయి కళవళముతో భుజముపైఁగత్తి విడచును).

గిరిరాజు—ఎవఁడురాద్రోహి! (లేచినిలువఁబడును)

ప్రచం—(తత్తఱముతో పాఱిపోవుచుండ ధీరమల్లాదులు ప్రవేశించి ప్రచండుని బంధింతురు)

(తెర పడు ను)

ఇది ప్రథ మాం క ము .





# చండిక

ద్వితీయాంకము

ప్రథమరంగము

ప్రవేశము ఆస్థానమునకుముందు ప్రదేశము

(ప్రవేశము పురుషవేషముతోఁ జండిక)

చండి—సీ. దైవమా! దుష్టస్వభావమా! యేనొండు
దలఁచుచో నీవొండుదలఁచినావె?
నాదుర్దశం జేసి నానాథ నీకెంత
పలుకంగరాని పెన్ బాములొదవె?
ధీరమల్లామాత్య! తీరిపోలేమురా
కలదు చండిక, రాజుఁగాచికోర?
గిరిరాజ! యింతకే గరువంబు నొందకు
మెప్పుడో నీశిరంబెగిరి పోవు?

గీ. నన్నుఁబురగిరి క్షత్రియాన్వయమునందుఁ
బుట్టఁజేసి నీపేరును బెట్టఁజేసి
నట్టిచండికా! యేనాటికైన నీదు
నామమర్మ నిప్పెదన్ జుమ్మి నమ్ము మమ్మ!

నాప్రాణనాథున కేమి శిక్ష విదింతురో! ఇట్టి నేరమునకు రెండే శిక్షలు రాజు కనికరించెనా! శాశ్వత ద్వీపాంతర వాసముఁ లేదా! యురి. నాదైవమునకు ఉరిశిక్షపడిన నేజీవించి యెందులకు?

ఆ! ఉరియా నానాథునకు చండిక బొందిని బ్రాణముండఁ జండిక మొఱలోఁగృపాణముండఁ బ్రిచంతున కురియా!

సీ. ఎప్పుడురి యటంచు నృపుని నోటను మాట
వెలికివచ్చు నపుడ, వెలికివచ్చు
నస్మదుగ్రఖడ్గ, మప్డయెగిరి పడు
నృపుని శిరము, నింత నిజము, నిజము.

ఒకవేళ శాశ్వత ద్వీపాంతరవాసశిక్ష విధించెనా! యేదో యుపాయము నఁ దప్పింపవలయు. శాశ్వత కారాగారావాస శిక్షవిధించెనా యిప్పు డేమియుఁ దొందరపడరాదు. బంధవిముక్తియు పారతంత్ర్యబంధవిము క్తియు నొక్కమాఱు చేయవచ్చును. విచారణ ఆరంభింతురేమో! ఒక రహస్యస్థలమునఁ గూర్చుండి చూచుచుండెద (నిష్క్రమించును)

## ద్వితీయరంగము

### ప్రదేశము ఆస్థానము

(ప్రదేశము గిరిరాజు. మంత్రి న్యాయాధిపతి సేవకులు-చూడవ చ్చినజనము కొంత దూరమున, బంగరుసంకెలలు వేయఁబడిన ప్రచం డుఁడు. ఒకరహస్య స్థలమునఁ గూర్చుండి చూచుచు (జండిక)

చండిక—(ఆత్మగతము) హా! మనోవల్లభా! నీమృదుకరాంబు జంబులకు నీకటికి బంగరు సంకెలలు తగిలించిరి? ఇంతవఱకుఁ బారతం త్ర్యమునుంచి తగిలించినవికూడ నివియేసుమా! హాపాపంపుదైవ మె ట్లుచేసె! ఎంతవైరము వహించె! హా! నాథ! పురగిరిరాజ్య సింహాసన మునఁ గూర్చుండఁ బెట్టినెంచితిఁగాని నిన్నీకఠిన కారాగారమునఁ గూ ర్చుండఁబెట్టుదునని యెఱుగఁగా? పారతంత్ర్య శృంఖలలఁబట్టి తెంతు ననిసంతసించితిఁగాని గోరుచుట్టుపై రోఁకలిపోటను నట్లువానిపై వీనిఁగూ

డఁదగి లింతునని స్వప్నముననైనఁ దలంపఁగా? స్వాతంత్ర్య మిప్పింతు నని. మెంచితిఁగాని చెప్పరాని ముప్పుఁ దెప్పింతునని తలంపఁగా? సామ్రాట్టు నొనర్చి సకలజనమస్తక పరిదేశములఁ బ్రకాశింపింప సమకట్టితిఁగాని నిందితునొనర్చి నిందఱ మ్రోల నిలుపుదునని భావింపఁగా? హానాథ! నామూలమునఁగదా నీకీపాటు! నీకీదురవస్థ! నాకీజగజంత మూలమున నింతవంత గలిగెనని నన్నంత మనంబున దూఱుచుంటివో! ఓనాదైవమా నీకు మేలుగలుగునని యూసించితినిగాని యిట్టిచెట్ట కలుగునని ఎఱుంగి నిన్నీకూపమునఁ ద్రోయఁజుమా! ముందుముందు నాథ ర్పపదభక్తి, నాశక్తి, గ్రహింపఁగలవు ఇప్పుడు నిందించిననప్పుడైనఁ బ్రశంసింపక పోవు!

గిరిరాజ—మంత్రీ! అందఱువచ్చిరి. విచార ణ కేలవిలంబము?

ప్రచం—మహారాజా! విచారణయేమి? నానేరమున నిరూపణయేమి ఈన్యాయాధిపతి యెందులకు! నేనుజగన్మల్లు నిఁజంపినదబద్ధమా! మిమ్ముజంప నుద్దేశించినదబద్ధమా! భుజమున గాయమొనర్చిన దబద్ధమా! ఈఫకీరమల్లాదులు నన్నుఁబట్టుకొనిన, దబద్ధమా? అంతయు సత్యము! నేనే యొప్పుకొనుచుంటిని! నన్నుమీరే శిక్షింపుఁడు మీరే శిక్షింపవలయునని యనుటలో సహజన్ముఁడనని నన్నుఁగని కరింతురని కాదు రాజవంశమువాని విచారించు వాఁడన్యుఁడైన నదికీర్తికరము కాదు. ఎంతశిక్షయైన మీరేవిధింపుఁడు!

చండిక—(ఆత్మగతము) జగన్మల్లునినేనుఁ జంపుటెఱింగియు ప్రాణేశ్వరుఁడు నానేరము తనపైఁ బెట్టుకొనుచున్నాడు హా! యిట్టిదయామయుని, గారకప్పగించి నేనీవలఁగులు కుచుండవలయునా? నేరము నాపైఁ బెట్టుకొన్న నాథుని విడుదలఁ జేయుదురా? అబద్ధము కాననేనీవల నుండుటయే మాచిది.

గిరి—హా! ప్రియసహోదరా! ఈబుద్ధినీకుఁ బుట్టినది కాదు. ఎవ్వరో దుష్టులు బోధించిరి.

ప్రచం—ఎవ్వరుబోధించిననేమి? ద్రోహముసల్పినది నేను; శిక్షార్హుఁడను నేను;

గిరి—(అపవారించి) మంత్రీ! ఎట్టి శిక్షవిధియింపవలెను?

మంత్రి—(అపవారించి) ఇంకేమి శిక్ష. ప్రాణదండనము.

గిరి—(అపవారించి) మంత్రీ! ప్రాణదండనమా!

మంత్రి—(అపవారించి) లేకున్న శాశ్వత ద్వీపాంతర వాసము.

గిరి—(అపవారించి) అయ్యో! అట్టి శిక్ష విధియించిన మాతమ్ముని నేనెట్లు చూడఁగలుగుదును. నేఁగూడవానితో బాటు పోవలయునా!

మంత్రి—(స్వగతము) హా! ఏమి వాత్సల్యము ఏమి సౌదర్యము?

గిరి—(అపవారించి) మంత్రీ! ప్రథమ దోషము క్రింద నిది త్రోసి వేయఁగూడదా?

మంత్రి—(అపవారించి) శాసనమును ద్రోసివేయుటయగును. శాసనము దైవ స్వరూపమగు ధర్మమును రక్షించుటకు నేర్పడినది. అట్టి ధర్మము మట్టి పాలగును?

గిరి—తమ్ముని మట్టిపాలొనర్పనా?

మంత్రి—(అపవారించి) దుష్టులు పెచ్చుపెరుగుదురు. మఱి యొక శిక్షయైన విధియింపుఁడు?

గిరి—(అపవారించి) ఏదది?

మంత్రి—(అపవారించి) శాశ్వత కారాగారము;

గిరి—(అపవారించి) అబ్బ! నాతమ్ముని శాశ్వతముగఁ గారాగారము పాలొనర్పనా? విధిలేదు. (ప్రకాశముగా) నిందితుఁడా నేరము నీవే యొప్పుకొంటివి. విచారణ యక్కఱలేదు. శిక్షవిధింతును;

ప్రిచం—చిత్తము.

గిరి—నీకీ రెండు నేరములకు శాశ్వతి కారాగారావాస శిక్ష విధించితిని ;

ప్రిచం—అయ్యో ! ఇదియేమి ? మరణదండనమైనఁగాదే ! ద్వీపాంతర వాసశిక్ష యైనఁగాదే ! ఇది యేటి శిక్ష ,

గిరి—రాజానుజునకు నిట్టి బెట్టిదపు శిక్ష తగనిదనియే నాతలంపు అయిన విధిలేదు కాని యిదికఠిన శిక్షగాదు. నిన్నొక సౌధమున నుంతురు దాస దాసీజనంబులు నిన్ను సేవించుచుందురు. అయిన గొందఱు సేవకులు నిన్నుఁగనిపెట్టుచుఁ గావలియుందురు. ఆత్మబంధువులతో నేరితోనయిన నీవు మాటాడఁగోరిన వారిని బిలిపించుకొని మాటాడిపంపవచ్చును.

ప్రిచం—నేనెవ్వరితోను మాటాడను ఇది యేటి శిక్ష ?

అందరు—ఆహా ! మహారాజుగారి వాత్సల్యము.

గిరి—సేవకులారా ! ప్రిచందునిఁ గొనిపొండు ?

సేవ—(అట్లు చేయుదురు)

గిరి—మంత్రీ నేఁడునాకెట్లోయున్నది. ఇంకఁ గొలువు జాలింతము.

మంత్రి—చిత్తము.

(చండిక దప్ప అందఱు నిష్క్రమింతురు.)

(చండిక యీవలికి వచ్చును అవ్వలి తెరపడును.)

చండి—అనుకొన్నదానికన్న నెక్కువ మేలే కలిగినది. నాథుని వైఖరిఁజూడ నిప్పుడు బంధవిముక్తి గలిగినను నామాట వినకుంటయు కాక నాచేయఁబోవు తంత్రములకు విఘ్నముఁ గలిగింపక పోవఁడని తోఁచుచున్నది. కొన్నాళ్లవఱకు అట్లుండనీ ?

సీ. ప్రాణేశ్వరునకిట్టి పాటుగల్గించిన
గిరిరాజురక్తంబు నరయు వఱకు
మంత్రి మంత్రి పదమ్ము మాయ మాయన్ జేసి
తిరిపెంపుఁ గూటికై తిరుగువఱకు
అవనీతలేశ్వరు నర్ధాంగిమెడబొందుఁ
బెల్చారేవునను దెంపించువఱకు
సకలసామంత రాజ్జనము శిరమువంచి
నాయాజ్ఞఁ బాలించి నడచువఱకు
గీ. పారతంత్ర్య విముక్తిని బంధముక్తిఁ
గాంచి సామ్రాజ్యలక్ష్మి వరించి వరుఁడు
భూవరుండగు వఱకును ముట్టఁబోదు
చండికాజ్ఞాక్షి యన్నంబుఁజండి సాక్షి.

కార్యసాఫల్య మగువఱకుఁ గాయలంగందలందిని కాయము నిల్పికొనెద. నేలయే నాకింకఁ బూసెజ్జ, నీరమే నాకింక క్షీరము. పతి హితమే నాకింక వ్రతము. (నిష్క్రమించును)

తృతీయరంగము

(ప్రదేశము గంగయిల్లు. ప్రవేశము గంగ)

గంగ—(స్వగతము) ఏమికారణమున నో చండికాదేవి నన్ను బిలిపించి నీవిటకాని విదూషకు నీదినము సాయంత్ర మగువఱకు నిల్లు గదలనీయ వలదనియు నట్లుచేసిన నీకోరినంత ధనమొసంగుదు ననియు, నుడివె. ఎందులకైన నాకేమి? మనకుఁగావలసినది ధనము. ఈయసంద ర్భపు దేవయ్య నెన్నాళ్ళు సేవించిన నాయమ్మ యొసంగు నంతధనమొ నంగఁగలఁడు. వేళయైనది. అతఁడింకను రాలేదేమి!

(నేపథ్యమునఁదలుపుచప్పిడి)

గంగా! గంగా. ఎచ్చటనుంటివి!

గంగ—[తలుపుఁదీసి] నేలమీఁద!

విదూషకుడు—ఓసీ! నేలమీఁద నుండక నెత్తిమీఁద నుందువా!

గం—ఆగంగ ప్రాణేశ్వరుని నెత్తిమీఁదనే యుండునఁట! కాని యీగంగ మాత్రము ప్రారబ్ధము నీకాలికింద.

విదూష—ఓసీ! నిన్నుమాత్రము నెత్తినెక్కఁచు కొనుటలేదా! నీయింటిలో నెప్పుడడుగు పెట్టితినో యిల్లాలినప్పుడే అవ్వలికి నెట్టితినిగదా!

గంగ—అదేగో సొరకాయ కోఁతలకారంభము! ఇల్లాలినవ్వలికి నెట్టిన నూరు విడిచిపెట్టి పోయినదా? నిన్నువిడిచి పెట్టిపోయినదా? పుట్టిల్లుఁజేరినది. బెట్టుతోరప్పించు కొనుచున్నది

విదూష—దాని మొగము! అదిరప్పించుకొనుట యేమి? నేనే

గంగ—నిజమే! ఆమెరప్పించు కొనవలసిన ఆవశ్యకమేమి! నీవే దానికినీడ వగునీవే, దానిచేతి కీలుబొమ్మ వగునీవే, మనస్సు నిలుపు కొనలేక, మమతఁబట్టఁ జాలక, నలుగురు నవ్వెదరని తలంపులేక, ఎగ్గుసిగ్గు మానము అభిమానములేక, నీచునుజూచిన కుక్కవలె వెఱ్ఱులెత్తి, అదియొంత చీకొట్టిన దాని యింటిచుట్టుఁ బ్రదక్షిణ మొనర్చుచుఁ గృతార్థుఁడవగుచుందువు

విదూషకుడు—అట్లుగాదే నేనే, ఎవ్వరైన నేమైన ననుకొందురని, రాజుగారువిన్న ఉద్యోగమూడునని, ఆలిపై ననురాగముగల వానివలె, నప్పుడప్పుడుపోయి వచ్చుచుందును. పోయినమాత్రమేమి! నీచెక్కుటముద్దులు! దానివీఁపున గుద్దులు! నీయింటిలో సొమ్ము, దాని కంటిలోదుమ్ము! నీకంఠమున దారహారములు, దానికంఠమున నూలుదారములు, జిలుఁగువలువలునీకు! చింపిరిపేలికలుదానికి ఈ సౌభాగ్యమేగదా!

విధిలేకపోయెదనేగాని మఱుంగుదొడ్డికిఁ బోయినవానికిబలె జరణమే నిలువదు

గంగ—(ఆత్మగతము) ఆసంగతి నేనెఱుంగకకాదు నిన్నింట గట్టి పడవైచుటకే ప్రయోగము! (ప్రకాశముగా) ఏమియిచ్చెదవు మాటలు! చరణమేనిల్వదఁట! ప్రతిదినము పట్టపగలు పోయినపోకడఁగూటదీపముఁ బెట్టువలెను నెందులకో! ప్రాణనాయకీ పదపద్మసంసేవ గాదా?

విదూషకుడు—ఓసీ! చేల! ప్రత్యహము రాజుగారితో వనవిహారమునకుఁ బోవుట నీ వెఱుంగవా? ఆపోకడ అక్కడకుఁగాని యిక్కడకుఁ రాదు వేళయగుచున్నది!

గంగ—ఊ! నేఁజెప్పలేదా మఱుఁగు దొడ్డికివచ్చినవాని కింబలె జరణము నిలువనిదిచ్చట మమతయచ్చట

విదూషకుడు—అచ్చటకుఁగాదే

గంగ—ఎచ్చటికిని బోవలదు నేఁగావలసినదాననైన నిచ్చటనే యుండవలెను

విదూష—ఓసీ! ఉద్యోగ మూడదా!

గంగ—తుమ్మిన నూడిపోయెడు ముక్కువెన్నాళ్ళు నిలువఁగలదు! ఉద్యోగమూడిన నగలమ్మిపెట్టెదను. నినుఁబోనీయను.

విదూష—ఓసీ! నీవు భోగంపుఁ బుట్టుకఁ బుట్టఁదగిన దానవు కావు ఎంతవలెను వలలోనిడి విటుల వలనమోయువలెను నగలు దెప్పించుకొనవలయునుగాని ఉన్నవానిని నూడఁగొట్టుకొనుట ఎట్టివివేకము! పోనీ గొలుసుడవుండి పోయెదను

గంగ—(స్వగతము) కొంతతడవుండునదియె చాలు! సరసల్లాపములలో మత్తుమందుఁ గలిపిన సారాయిఁదావి చి వివము సుకేసి

వై చెదను.పిమ్మట నెట్లుపోగలఁడో చూచెదను (ప్రకాశముగా) ఆలాగు ననే కానిమ్ము కొంచెము లోనికిరమ్ము

(విదూషకునితో నిష్క్రమించి పునఃప్రవేశము గంగ)

వీఁడు మైమఱచి పొరలుచున్నాఁడు వీనినింటఁగట్టి పడవైచినసం గతిఁదన కెఱింగింపవలయునని చండికా దేవి చెప్పియుండెఁగదా పోయి యెఱింగించి వచ్చెదఁ (నిష్క్రమించుచున్నది.)

తురీయ రంగము

[ప్రవేశము ఉద్యానవనము ప్రవేశము ఒక చంద్రిశిలా వేదికపైఁ గూర్చుండి గిరిరాజు)

చండి—[సాలంకృతయై ప్రవేశమొకప్రక్కనుండి ఆత్మగతము) ఓ! పంచభూతములారా! ఓ! సర్వదైవతములార పరికింపుఁడు

శా. అక్షీణోగ్రిత సంగరస్థలుల సింహంబట్లు వర్తించు శ
తుృక్షోణీశ్వర సైన్యకాలుఁడు, దోలిన్ దోస్సారమే పారఁగన్
గాక్షేయంబునఁ జేయనేరని మహాకార్యంబు సాధించున
బ్జాక్షీ రత్నమిదే కటాక్షమునఁ దల్ ప్రారంభమున్ జూడరే.

ఈ భూతలేశ్వరుండు నీతి పరుండట, ఏకపత్నీ వ్రతస్థుండఁట, పరసతులం గన్నెత్తి పరికింపఁడట, అట్టిచో నాకటాక్షమున కితఁడు చిక్కునా! నావలలో నితఁడు పడునా! చూచెదఁగాక? అనన్య సామాన్య మగు నాసౌందర్యము అఖిల జన సంస్తవ పాత్రంబగు నాచాతుర్యము, రిత్తవోవునా! [కొంతదూరమునకుఁ బోయి గిరిరాజునకుఁగన బడునట్లునిలిచి పూవులుఁగోయుచువిలాస చేష్టితముల నొనర్పుచున్నది.

గిరి—[చండికనుఁ జూచి అచ్చెరువుతో] ఓహో! ఎక్కడి దీ సౌందర్యమంటపప్రదీపిక? ఎక్కడి దీ జగత్త్రయ సౌభాగ్య జన్మభూమి ఎక్కడిదీ సుందరమందారలతికామతల్లి?

చ:డి—(ప్రేక్క చూపుల గిరిరాజును జూచి) ఓహో! కలియుగ శుకమహర్షులు గాఁబోలునే కన్నెత్తి పరసతులఁ గాంచరు గాఁబోలునే (నవ్వుకొనుచు సిగ్గుతో నవ్వలి మొగముగుచున్నది)

గిరి—ఓహో? ఏమి చంచల నేత్రములు, ఏమి విలాస! చేష్టితములు! ఏమి దరస్మితములు! ఏమి లజ్జానటనములు!

ఉ. ఏవ్వతెయొక్కొ యీసరసిజేక్షణ యీక్షణమీక్షణావళిన్
మవ్వపు నవ్వులం బఱపి మమ్ములయించుచు, నివ్వనంబునన్
బువ్వులు గోయుచున్నయది పొల్తుక భంగినిఁ జూడనేమొకో
పువ్విలుకాని బారికనుఁ బోఁడిమి దోంచు విధంబు గన్పడున్.

ఎక్కడనుండి యిక్కడకవతరించి నది యీజగన్మోహిని!

సీ. గగనంబు నందుండి పగటిపూటన్ జాఱి
ధారిణిఁబడినట్టి తారయొక్కొ?
నందనమిదియంచు డెందమ్మున భ్రమించి
వనముఁ జేరినదివ్యవనిత యొక్కొ?
పుష్పశరుని బాణములకుఁ బూవులుగోయఁ
గోరివచ్చిన రతినారి యొక్కొ?
నాపుణ్యవశమున నాకు దర్శనమీయఁద
లంచి వచ్చిన వనలక్ష్మియొక్కొ?

గీ॥ పడఁతియెవ్వతియొక్కొ! తద్భర్త కాఁగ
నెవఁడునోఁచె నొక్కొ! కులమేమియొక్కొ?
అతివకింతకుఁ బెండ్లియైనదొక్కొ?
ఇంతకిచటకు రాఁగతమేమి యొక్కొ?

చండిక—(మనోగతము) పాపమునోరుఁ దెఱచుకొని పరికిం చుచున్నాఁడు? కామభూతమావేశించుచున్నది) ఎఱుఁగనట్లు పువ్వులు

గోయుచు ముందునకువచ్చి గిరిరాజు నరసిబెదరినదానివలెనటించి పయ్యెద జాఱినట్లొనర్చిసర్దుకొనుచు సిగ్గునభినయించి ముసిముసి నవ్వులతోఁ బొదరింటి మఱుగునకుఁబోయి నిలుచుచున్నది)

గిరి—అయ్యారే! ఏమియీ యొయ్యారము!

సీ॥ పాలిండ్లఁ గన్పింపఁబయ్యెద సడలించు
సడలించి యంతలోఁ జక్కఁబఱచు!
మందహాసమ్ములు మలయించు మలయించి
సొగసేద సిగ్గున మొగము మాడ్చు!
తళుకుఁజూపులనన్నుఁ దిలకించుఁ దిలకించి
యలుకన దృష్టుల నుర్విఁబఱపు!
ఎఱుఁగనట్టుల చెంత కేతెంచు నేతెంచి
పరుగున నవలకుఁ బాఱిపోవు!

గీ॥ అతివచెయిదమ్ములకు నేమియర్థమొక్కొ!
నన్నుఁగనిరొయొకో! కాకున్న నైజములొకొ!
పరసతులఁదల్లులుగ నెంచుభావ మివ్వ
ఘాటియెటువోవ నటుపోవు నేటికొక్కొ?

ఈకాంతామణి ఎటువోయినది! (పరికించి) ఓహో ఆపొద రింటిమఱుఁగున నిలిచియున్నది

గీ॥ కలికిచెంగిటకుంబోయి పలుకరింపఁ
గొంచెపుంబుద్ది పీడంచు నెంచు నేమొ!
ఇటులె బిగదీసికొనియున్న నింతిమిన్న
పీడరసికుఁడటంచు భావించునేమొ?

ఏమైననఁ గానిమ్ము. పలుకరించియే చూతును (పరిక్రమించి) ఓకాంతామణీ! కళవళపడకుము.

మ॥ చెలు లంతఃపురకాంతలేనియుఁ బ్రవేశింపందలం, పూనరీ
యెలదోఁటంజొరఁ నీకునేరొసఁగిరో యీపాటి స్వాతంత్ర్యముల్
గలవాణీ! యేలరాణి చెల్లెలవొకో? గాకున్న నెవ్వర్తవో?
తెలియంజేయుము నీయుదంతమ్మును సందేహమ్ము మాకయ్యెడున్

చండి—(తలవంచుకొనినవ్వుచు) ఓపురుషవర్యా ? దయచేసి ముందునాకుఁ బ్రత్యుత్తరమిందు.

మ. ఎలదోఁటం జొరనాకు నేరొసఁగిరో యీపాటిస్వాతంత్ర్యమా
పలుకట్లుండఁగ నిందు నేఁ దెలిపెదన్ బ్రత్యుత్తరం బవ్వలన్
గలయట్టుల్, దొలుతన్ వచింపుఁడిటులేకాంతమ్ము నందున్న కాం
తలతో మాటలు గల్ప నేరిడిరొ స్వాతంత్ర్యమ్ము మీకిచ్చుటన్.

మఱియుఁ గలవాణీ? యని, నారాణి చెల్లెలవా నాముద్దులమఱఁదలవా యని, యింతచనువుగ బరస్త్రీలఁ బలుకరింపఁ దగిన స్వాతంత్ర్యము మీకెవరొసంగిరి—మలహారుఁడుగాఁబోలు

గిరి—మలహారుఁడుగాఁడు మలహారునితో నంగనకు నర్థశరీర మిప్పించిన మాయలమారి మదుఁడు- మరుఁడునుగాఁడు మరుని చేతి జంత్రపు బొమ్మవగు నీమధురమందహాసములు నీమనోజ్ఞ రూపరేఖా విలాసములు! నీలలిత లజ్జానటనములు! నావంతయ్యెఁగదా ? నీ కెవ రొసంగిరో చెప్పుము?

చండి—నాకా! నేనుమాత్రమెందులకు దాఁపవలయు ? నిరు పమానమగు నీయశము. నిఖిలలోక స్తోత్రపాత్రమగు నీ పవిత్రచరి త్రము—సదమలదయార్ద్రమగు నీహృదయము—అనన్యసామాన్యం బులగు నీ యందచందములు.

గిరి—(స్వగతము) ఓహో! ఏమివచోనైపుణ్యము ? (ప్రకాశముగా) తరుణీమణీ! నీవెవ్వరిదానవో తెలుపవలతివి?

చండి—పాపము మిగులఁ గుతూహలముతో నడుగుచుంటిరి నా వృత్తాంత మెఱింగిన బెదరిపోయెదరు.

గిరి—ఎవ్వరికి ? నీనాథునకా !

చండి—నా నాథునకు జడియవలసిన యవసరమే లేదు, లోక నాథునకు, లోకమునకు

గిరి—ఏమి ? వావివరుసలు వ్యతిరేకములా ?

చండి—వావివరుసలు వ్యతిరేకములు గాకున్న నన్నుఁబరిగ్రహింతురా! నన్నునుగ్రహింతురా!

గిరి—ఓ చేలా !

కం. సిరిరా మోఁకా లొడ్డెడు
నరులుండఁగవచ్చు నీ జనమ్ములలోనన్
సరసీజాక్షి వలచిరా
హర హర! «ఉహు», వనెడునట్టి యరసికుఁడున్నే?

చండి—రసిక శిఖామణి! ధన్యోస్మి? నేను వరునకైన దానసే నీముద్దుల మఱఁదలనుఁ పరిచందునిభార్యను—పెండ్లియాడుటచేఁజుమా!

గిరి—(ఉలికిపడి) ఆ !ఆ ! నీవు పరిచందునిభార్యవా ! చండికా దేవివా !

చండి—రాజేంద్రా! ఎందులకంతకళవళము! పరకాంతయైనఁ బనికివచ్చునుగాని పరిచందుని భార్యయైనఁ బనికిరాదా యేమి ? అతఁడు నీకుఁబగవాఁడైన నేనేమి? అతనికి నాకు నెంత తారతమ్యమో పరికింపుము.

సీ. పాణియుగళ్ గ్రహియింప భావించె నీతమ్ముఁ
డేను పాణిగ్రహింప నెంచియుంటి
కాటిని నినుఁ జేర్పఁ గాంక్షించె నాద్రోహి
'మో'సెజ్జఁ జేర్పఁగా నెంచియుంటి
అగ్గిని నినుబెట్ట యత్నించె నాక్రూరుఁ
డేఁ గౌఁగిటంబట్ట నెంచియుంటి
కత్తిఁ గుత్తుకఁ గోయఁగాఁ బూనె నానీచుఁ
డేఁ బూసరము వేయ నెంచియుంటి.

గీ. నీకుఁ బిండమర్పింప యత్నించె నాతఁ
డేను నా దేహమర్పింప నెంచియుంటి
దాఁదిలో దకమ్ము లోపంగ దలఁచె నాతఁ
డేను మోవిపానక మీయ నెంచియుంటి.

రాజేంద్రా! దయతో నావృత్తాంత మాద్యంతముల నాకర్ణింపుము— నేను నిన్నుఁ గామించుట ధర్మమవునో కాదో నీవే నిర్ణయింపుము. నేను వయస్సువచ్చి గృహమున నుంటిని. నీవొకనాఁడు వారువము నెక్కి రాజవీథిని మిత్త్రులతో నేగుచుంటివి. నేనుఁ దలుపుచాటుననుండి నిన్నుఁ జూచితిని. అప్పుడే నామనస్సు నీయందు లగ్నమయ్యెను. సిగ్గుతో పెద్దల కెఱింగింపనేరక కొన్నాళ్లు గడపితి. పిమ్మట నెటులో కొంక నాదు తండ్రి కెఱుఁగం జేసితిని. నీకప్పటికే వివాహమైనదనియు, నీవేక పత్నీవ్రతస్థుండవనియు నాతండ్రి నాయాశ నిరాశఁ గావించె. అటుపైని నాతండ్రి నన్నుఁ బ్రచండుని కీయ నిశ్చయించెను. ఇష్టము లేకున్నను అంతఃపురమున నున్న సంతతము నీముఖారవింద సందర్శనమున నయినఁ గాలముఁ గడపుకొనవచ్చునని, నేనందుల కంగీకరించి యాతనిఁ బెండ్లియాడితి— పెండ్లియాడుట మాత్రమే సుమా! ఈ రెండేండ్లనుండియుఁ

జంటికావ్రత మాచరించుచు వ్రతపూర్తి యగువఱకు బురుషస్పర్శనము కూడదని ప్రచండుని వంటక నియమమునఁ బెల్లఁబుచ్చుచుంటిని—ఇంక నావ్రతము రెండుమాసములున్నది. వ్రతము పూర్తియగువఱకు నా మమత యెట్టులైన నీకెఱింగించి నీవంగీకరించినసరి లేకున్న నీశరీరము నగ్నికర్పింతమని దృఢనిశ్చయముతో నుంటిని. నాపుణ్యవశమునఁ బ్రచండుఁడు కారాగార బద్ధుండగుటయు నీతోఁ బ్రసంగించుట కనువు చిక్కుటయు సంభవించినది. ఇంక నీదయ నాదుప్రాప్తి. ఎటులున్న నటుకాఁగలదు. రాజేంద్రా ! ఆలోచించుచుంటివేమి ?

గిరి—ఏమియు లేదు.

చండి—రాజచంద్రా ! ఏమియు లేదనఁగ నేమి ? నిన్ననుగ్రహించుటకు సందేహమేమియు లేదనియా ? కాక మాటలబండారవే గాని మాకేమియు మమకారము లేదనియా ? మాటాడవేమి ? అహా పురుషులకిది నైజము సుమా !

గీ. ఊఁహూఁహూని బిఱ్ఱబిగిసెదు సుదతి కౌఁగిలిఁ
బ్రాఁకులాడుట పురుషులభంగి చూడ
అలయనుచుఁ దలయూఁచు నతివఁజూచి
దూరమేఁగుట రసికుల త్రోవ దేవ!

గిరి—కాంతామణీ!

సీ. తమ్ముఁడటంచు హితమ్ముఁదలంపక
లేని నేరము నత్తిపైనిగట్టి
కలుషమతిం జేసి కఠిన కారందోచి
ధర్మమ్ము పోనాడి దయనువీడి
భామినిఁ దనకుమారిం బోలుదానిని
దన సహజన్మని ధర్మపత్ని
సయముసపోలేక భయమువనొట్టో
పరమసాధ్విం బట్టి భంగపెట్టి

గీ. పలుకొను చున్నవాఁడ హా! యాచనంటి
ఇంతద్రోహి, యింతటినీచుఁ డింతక్రూరుఁ
డింతహీనాత్ముఁడెందుండెనే? యటంచు
నన్ను దుష్కీర్తి తిట్టరే పలువురతివ!

చం:డి—రసిక శిఖామణీ! నిఖలమెఱింగిన వాఁడవు. నీకుఁ జెప్పుటకు నేనెంతదాన! అయిన నామనవి నించుక యాలించి కర్తవ్య మాలోచించు కొనుఁడు.

గీ. అబ్జభవునివ్రాఁత నంగభవుని కోఁత
నరులకిట్టి వర్తనంబు లొదవు
మందులయినవారు నిందించెదరుగాక
పరుకర్తలయ్యు నేరముకకు

ఇదియునుం గాక.

ఉ. నీతులకేమి యెల్లరును నీతులు సెప్పెడివారె, ధర్మముం
గోతులు ద్రివ్వువారె కొనఁగోటను, నంతట నేమియయ్యె? స
ద్యోతులు గొట్టువారి నొకఁడేనియు నుండఁడు నాతిఁజూచినన్
గోఁతలుమాని, కక్కుఱితిఁ గూలని వాని, మహీశ్వరాగ్రణీ!

రాజేంద్రా! నీవుపరధ్యానమునున్నాఁడవు. నాయీప్రసంగముఁ గోరిన దన్నకాఁ డోఁగూడదని పూఁబోఁడి జవ్వనమువలె, లోకనిందకు వెను ంజ వేయురసికుని మోహమువలె వ్యర్థమగుచున్నది. సరి. రసికాగ్రణీ! నామనసులోని సంగతి నీవెఱింగితివి. నీమనసులోని సంగతినేనెఱింగితిని నాకున్న మమకారమునేను వెల్లడించితిని నీకున్నయిబ్బంది నీవువెల్లడిం చితివి నాది కానిపోని యారాటము. నీదివట్టియార్భాటము ఇంకనిక్కడ మనకేమిపని? ప్రొద్దుగ్రుంకుచున్నది నీవిదూషకుఁ డెందుచేతనో నేఁడు

రాలేదు- అతఁడువచ్చినను నింకనెవరైన వచ్చినను నాయభీష్ట మొన గూడకపోగా నేను నిందపాలగుదును. పోయివచ్చెదను. రాజేంద్రా! కపటిమాట. ప్రేమకలుగుచున్నఁ గలుగునదికాదు తొలఁగుచున్నఁ దొలఁగునదికాదు. అపకీర్తినది లక్ష్యపెట్టదు. అపకీర్తియగుగు వెనక కీడ్చిన మోహాము ముందునకునీడ్చును. రాఁదలఁచుకొన్న రహస్యముగ రావచ్చును, పోవచ్చును. ఈవనమునుండి నామందిరమునకుఁదోవ యున్నది. నాకుసెలవు! ఈదీనురాలిపై — నీదురదృష్టవంతురాలిపై దయయుంచుము.

(తిరిగిచూచుచు నిష్క్రమించుచున్నది)

గిరి—ఓహో! ఈకలవాణిపోఁగినది-నామనసునుండి కోర్కె మాత్రమెంత ప్రయత్నించినను గదలకున్నది-ఏమిచేయుదును?

ఆ - వె బంధుకోటిమాట భరియింతునెరింతు
హితులుదూఱ లోకతతులుదూఱ
యముఁడు వెట్టుబాధనైన సైఁచెద నైన
స్మరుఁడువెట్టుబాధ సైఁపఁజాల

ఏది యుచితమార్గము! ఇది.

(చండికపోయినవంకకు నిష్క్రమించును)





# చండిక

## తృతీయాంకము.

### ప్రథమ రంగము.

ప్రదేశము. మలతిప్రసాధము. ప్రవేశము ధీరమల్లుఁడు

ధీర——(ఆత్మగతము) హా! ఎంత వైపరీత్యము! వాయసము వసారు పై చుచున్నది. మీనము బయల సంచరించుచున్నది. సింహము గ్రామసింహముల చేరికొని తిరుగుచున్నది. సకల ధర్మశాస్త్రవిదుఁడగు గిరిరాజ మహారాజేంద్రుఁడు పరకాంతాలోలుఁడై పాపకూపమునఁ బడి పోవుచున్నాఁడు. హా! గుమగుమలాడు నీ గులాబిపూవున కింతకాలమున కీటకంబులంటెనేమి? భగ్గుభగ్గున మండు నీయగ్గికిఁ జెదలు పట్టుట యేమి! అన్నన్నా!

సీ. భువనత్రయపవిత్ర పురగిరిక్షితినాథ
వంశమ్మునకు నెంత వాదువచ్చె!
అసమతేజోవిభా జనునకు గిరిరాజ
వసుధేశ్వరున కెంత వాసిదగ్గె?
లలితపాతివ్రత్య నిలయులు శ్రీవాత్స్య
రాజాంగనల కెంత యవ్వహెచ్చె
పతితపాపక్రియారత దుష్టకోటికి
హరహర! యెంతటి యలుసు చిక్కె!

గీ. ఈమహాభూత, యీప్రేత, యీపిశాచి
యీచెదుగుగంత, యీఘోరమృత్యుకాంత.
నృప కులమ్మున కెట 'దాపరించెనో కో?
అలమందకు బెబ్బులియట్టులకట.

అక్కటకటా! విష్టపత్రి తయపవిత్ర వాత్స్యక్షత్రియవరవంశ యశోలతాల వితతింబగు నీదుశ్చరిత్రంబుఁ దలంచుకొన్న మాతిమనస్సల్లము ధల్లడిల్లుకొని పోవుచున్నది. నిఖిలజననిందాపాత్రంబగు నీనిర్వాదము వినలేక వీనులు వ్రీలిపోవుచున్నవి. పరమాసహ్యకరంబగు నీపాపకార్యముఁబరికింపనేరక కన్నులు గాలిపోవుచున్నవి. ఘోరలజ్జా ప్రదంబగు నీకటిలోదంతము షాకొననేరక వాయెండికొని పోవుచున్నది. పురగిరిక్షత్రియాన్వయోద్ధారక! మలహార! పలుక రాని యీపంకిలాచరణముఁ, దలఁపగాని యీదారుణ కృత్యముఁగనరాని యీకలుషోదంతము, వినరాని యీవికృత వృత్తాంతమునంత మోదింపరాదా! మహామోహసాగరమునఁ జిక్కి, మధుపాన మొనర్చుచు మైమఱచిమతిలేక పాపప్రవాహమునఁ బడికొట్టుకొని పోవుచున్న గిరిరాజరాజశేఖరుని నీచరణదాసుని నుద్ధరింపరాదా! హా! మహారాజా! కలియుగధర్మరాజా! ఎంతలో నెంత చెడిపోయె? స్వామిభక్తి పరాయణుల సాఁగఁదోలుచున్నాఁడు. చెనఁటుల పాలుద్రావి పొదుగుఁగోయు దుర్మార్గుల రాజద్రోహులఁ జేర్చుకొనుచున్నాఁడు. సమర్థుల స్థానముల నసమర్థుల నిలుపుచున్నాఁడు. మిత్రులఁద్యజించి శత్రువులఁ జేపట్టుచున్నాఁడు? ఇవియెల్ల నామాయలమారి - ఆపెనుభూతము - చండిక కుతంత్రములుగాఁ దోఁచుచున్నవి? ఏబుద్ధితో నిట్లుచేయుచున్నదో! ప్రచండుని సింహాసన మెక్కింప వలయుననియా! రాజుతన గీఁచిన గీటుదాఁటుట లేదే. ఆయుద్దేశ్యమున్న భర్తను గారాగారమునుండి విడిపింపదా! ఏ హా

ఈకుతంత్రములన్నియు నటుగానున్న నింకెందులకు? స్త్రీలచిత్తవృత్తి నెఱుంగ నెవరికి సాధ్యము!

ఉ—వారిధిలోన మీనములు వర్తిలుజాడ లెఱుంగుప్రోడలున్
భూరితరాంధ్యమందు నల వ్రూసలనేరెడు ధీరులున్ బవల్
తారల లెక్కడంగలుగు దంటలు ధాత్రిఁగలారు లేరువో
నారులచిత్తవృత్తినిగనందగు నేర్పుగలట్టి దిట్టరుల్.

పురగిరిరాజ్య సింహాసనము దానధిరోహింపవలయునని కాదు గదా? ఏమో! హా! యీసింహాసనమున కట్టిగతి పట్టునా! ఈరాజ్యము నకట్టి చెట్టవుట్టునా!

ఉ. చండకరాన్వయాంబునిధి చంద్రులు, ఘోరసమన్మృగేంద్రులు
ద్దండపరాక్రమాఢ్యులు, విదారితవైరులుఁ బూర్వమేధరా
మండలమేలిరో యహితమండలి గుండెలువ్రీల సమ్మహిన్
రండయొకర్త పాలనమొనర్చునె? కూడ్చునెదైవ మీవిధిన్

ఈరాజచంద్రుఁడు చండిక వలలోఁ బడెనని విన్ననాఁడు విశ్వసింపక మందలింపనైతి. విశ్వసించిన పిమ్మట మందలింతమన్న నతనిదర్శనము దుర్లభమయ్యెను. ఏపైనవారింతురని కాఁబోలు నారక్కసి రాజేంద్రుని బయటికే రానిచ్చుటలేదు. చండికాచరణ సాన్నిధ్యమే రాజేంద్రునకు సభామంటపమైనది. అదియే యంతఃపురమైనది. అదియే యుద్యానమైనది. విదూషకుఁడు చెప్పినట్లు మహారాజును సందర్శింపవలయునన్న నింక నామారిమందిరముననే చూడవలయు. ఆహా! అకులపాంసని మందిరమునకుఁ బోవుదునా! ఏమి! ప్రారబ్ధము! తప్పదు. పోయి నాయాశ యేమగునో పరికింతును. (నిష్క్ర)

## ద్వితీయ రంగము.

ప్రవేశము చండికామందిరము

ప్రవేశము చండిక.

చండి—(ఆత్మగతము) 'ధీరమల్లునకు నేఁటికిఁ దెలివివచ్చినది గాఁబోలు? ఇన్నాళ్లకుఁ బాప మీ పాలపాపఁడు గన్నులు దెఱచినాఁడు ఈ చావు తెలివి యుద్యోగావసానమునకు నుద్భవించిన దేమొ? రాజుగారితో రహస్యాలోచనములు గాఁబోలు? రాణిగారి రాయబారమో మంత్రిగారిమంతనమో! నేనన్న దితనికి నఱకాలిమంట నడినెత్తి కెక్కనట! మహారాజుగారి మనస్సు ద్రిప్పుటకు మంత్రిచామ్రిలవారు దయచేయుమరని నిన్నఁగదా విదూషకుఁడు చెప్పె? వీఁడేమి త్రిప్పఁగలఁడు? నీరుపల్లమునకుఁ బాఱుఁగాని మెట్టకెక్కునా? పాదరసముఁ బట్టికొనుటకు వీని యబ్బతరమా! కుక్కతోఁకను వీఁడు సరిచేయునా. త్రిప్పుటకు రాజు శకట చక్రమా! వీనిమొగము! వీని సేత్రిప్పెదను! వీనఁడా యుద్యోగమునకుఁ దిలోదకము లిప్పించి తిరిపెమునకూరూరు దిప్పించెదను. వాఁడుగో! సేవకునితో వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము ధీరమల్లుఁడు సేవకుఁడు)

ధీర—(చండికను జూచి తలవంచి కొనును)

చండి—అమాత్యపర్యా!

ఆ. వె. గరుడపక్షి గనఁబఁడకించివె అపునఁ
బడగవాల్చు త్రాఁచుఁబాముపోలెఁ!
దలనువంచి కొంటి తిలకించి తల్లకితో
గాంతసేను మృత్యుకాంతగాను.

ధీర—మృత్యు కాంతకుఁ దలవంచు కొనుట భీరులతోత్రి

చండి—అయిన నర్థములేని యీతలవంపులేమి?

ధీర—అర్థములేకేమి? మహారాజు మాంద్యము తలవంపులు గాదా? పూతచరిత్రలకుఁ బురగిరి క్షత్రియ కాంతలకిట్టి బుద్ధి పుట్టుట తలవంపులు గాదా?

చండి—అంతియేనా? చేతులు త్రిప్పుచు నీతులఁ జెప్పుచు నట్టిరాజుక్రింద నమాత్యులై యుండుట తలవంపులు గాదా!

ధీర—సాదరసమంటి వన్నె చెడినను బంగారము బంగారమే! దానిఁదిరుగ బాగుచేసి కొనవచ్చును.

చండి—ఓహో! ఆయుద్దేశ్యముతోనరుదెంచితిరా! అయిన గంపాలియేఁడి? అక్కఱ లేదుకాబోలు? అన్నిపనులకు నమాత్యులే సమర్థులు గాఁబోలు? చూతముగాక.

ధీర—నేను మహారాజుగారితో మాటాడుటకు వచ్చితిని.

చండి—తొందరయేమి? మహారాజ్ఞి మాటాడుచున్నది.

ధీర—మహారాజ్ఞి యెవ్వరికి?

చండి—పురగిరికి. పురగిరిరాజ్యసింహాసనమునకు.

ధీర—అబద్ధము. మహారాజ్ఞి పట్టమహిషి.

చండి—పట్టమహిషి పట్టమహిషిగాదు. మంత్రి మంత్రికాఁడు సర్వము చండికాదేవ్యధీనము. ఇదిగోఁ జిటికెనవ్రేలున నున్నది రాజముద్రిక. ఈనఖాంచలముననున్నదిపురగిరిమహారాజ్యముఁ, బురగిరిమహారాజ్యాధికారమ్ము, బురగిరిరాజ్య ప్రజల సర్వస్వము. ఈకటాక్షమున నున్నది పురగిర్యధీశ్వరునిజీవితము. ఈజిహ్వాంచలమున నున్నది నీ ప్రాణమునీవుపొగడిన రాణీప్రాణము నెల్లరిప్రాణము! తెలిసినదా! సర్వము నీచండికా దేవ్యధీనము.

ధీర—ప్రస్తుతము నీయధీనము మతిమాలిరాజొసంగిన యధికారము! కానియెల్లర ప్రాణము భగవదధీనము.

చండి—అందఱమాటకేమి? ఈపురగిరి మహారాజ్యములోని సకలజనమ్ముల యర్థప్రాణములు నాయాఱచేతిలోనివి. ఇంతయేల? నీవు నాయాజ్ఞఁ బాలింపక నాపక్షమవలంబింపక ప్రతిఘటించి నిలిచి చూడుము! నీయుద్యోగము, నీభోగము నీప్రాణము నీయాలుబిడ్డల ప్రాణముఏమగునో చూచెదవు;

ధీర—నీయాజ్ఞ బాలించుట యననేమి? నీమాటలలో నప్పటి నుండియు నొకగూఢార్థము స్ఫురించుచున్నది. ధీరమల్లుఁడు కాముకుఁడు గాఁడు

చండి—కాముకినై నిన్నుఁగౌఁగిలింపు మనుటలేదు. నాపక్షము వలంబింపు మనుచుంటిని

ధీర—అనఁగ నీలోఁజేరి ప్రభుచంద్రు నింకను భ్రష్టునిఁ జేసి ప్రాణములుగూడఁదీసి, యాతనిఁజతినెక్కించి నిన్ను సింహాసనమెక్కించి సిగ్గులేక మంత్రిత్వము వెలుఁగఁబెట్టు మనుచుంటివా!

చండి—అమాత్యవర్యా! అఁడుదానిక్రిందనుండుట హైన్యమని తలంచుచుంటివా! నీకా యాదరక్కఱలేదు. సింహాసనమెక్కునది చండిక గాదు. ప్రచండవీరకేసరి.

ధీర—ఏమి! భర్తృక్షేమమున కాయీభగీరధప్రయత్నము! పాపము!సతీమతల్లి స్వైరిణీవృత్తిని సంపాదించిన సామ్రాజ్యముఁబరిగ్రహించి ప్రచండవీరకేసరి ప్రభుచంద్రుఁడై సిగ్గులేక సింహాసన మెక్కి చిందులాడునా!

చండి—స్వైరిణీవృత్తియేమి?

ధీర—స్వైరిణీవృత్తిగాక యిది సద్వృత్తియా!

చండి—నీవు పొరబడుచుంటివి. నేను జండికావ్రత మాచరించుచుంటిననియుఁ దద్వ్రతనియమములును నీవువినలేదా!

ధీర—వింటిని. రాజుకొఱకేయనియువింటిని. వ్రతముపూర్తి

యగు త్రోడనే శివతనికిల్లాల వగుదువనియు వింటిని

చండి—ఇదియసత్య కల్పనము - మూఢలోకమట్లు విశ్వసిం
చుఁగాక. ఓబుద్ధిమంతుఁడా! నీవెట్లు విశ్వసించితివి!

గీ. వరునిఁ బాసిన పురగిరి వంశజాత
పరుని వలచునె? మృతినైన వలచుఁగాక
కూర్మిమగని నెడంబాయు గువ్వ,లాఁతి
పులుఁగు వలచునె మృత్యువున్ వలచుఁగాక.

ఏమిని యూయందగానిఁ గామించితినో!

సీ. ముకుతిలు వడిన యా పుడమిఱేని మొగమ్ముఁ
గనియేను వలపును గంటి నొక్కొ?
నారయునంబోలె నరసిన యారాజు
కురులకేఁ దమకమ్ముఁ గొంటినొక్కొ
పొరకకట్టలఁబోలు ధరణీశు మీసాల
వాసికేఁ దబ్బిబ్బువడితి నొక్కొ
సైరింపఁగారాని త్ర్మ్రాజానిముసలికం
పునకేను మోహమ్ముఁగనితి నొక్కొ?

ఆ. వె. ఎట్టియ దమరసి యెట్టి చందముఁజూచి
యెట్టి సుఖముఁగోరి యిట్టిసూరి
పొందుఁ బ్రాకులాడు చుంటినొక్కొ! నేను
ధీరమల్ల నీవ తెలుపుమయ్య.

మోహించినట్లు నటించుచు రాజును మాయసేయుచుంటిని. అతనియువ
సానమే నావ్రితావ సానము.

ర—హా! బ్రిహ్మరాక్షసీ! నీవ్రతముపూర్తివఱకు రాజువనిఁ

బూర్తి సేయుదువా! ఏమి మూటఁగట్టుకొని పోయెదవు.

చండి—రక్తపాతములేకుండ రాజ్యము ప్రాణవల్లభునకు బ్రిచండ వీరకేసరికి.

ధీర—అదిమాత్రమసత్యము సుమా! ఈధీరమల్లుని కంఠమునఁ బ్రాణములున్నంత వఱకు రాజవంశమున నొక మొలక యున్నంతవఱకు పురగిరి క్షత్రియులలో నొకపురుషుఁడుగాని యొకస్త్రీగాని బ్రతికియున్నంతవఱకు నీమనోరథము వ్యర్థము ప్రచండుఁడు ప్రభువగుట యబద్ధము.

చండి—ఏది యబద్ధమో చూతము. మహారాజుగారు మూల విరాట్టుంబోలె మూలనున్నారు. వచ్చి మాటాడుము.

ధీర—సేవకా! దారిఁ జూపుము.

సేవ—దేవా! ఇటు ఇటు.

(నిష్క్రమించుచున్నాఁడు)

తృతీయ రంగము

ప్రదేశము—అంతఃపురమందు మేడయొక్క మందిరము

(ప్రవేశము ఆసనమునఁ గూర్చుండి సురఁబానముగిరిరాజుసరస నిలిచి చండిక)

గిరి—ప్రియసీ! చండికా ఏది? ఈయమృతము నీవింత సేవించి నీమధురాధర పీయూషము మాకొకింత దయసేయుము. దేనిరుచి యెట్టిదో తెలిసికొందము.

చండి—వ్రతభంగము గాదా?

గిరి—ఓహో! గొప్పచిక్కే వచ్చినది. పోనీ నీయధరసుధ మాకీయుమా నే దీనినొకింతనీవు ద్రావి—సంశయమెందులకు? నేనంగీకరింపలేను. మిగిలినదైన నాకిమ్ము. నీయధరామృత స్పర్శనమున

నిదిమఱియింతి మధురతరమైన నగును. (మధుపాత్రి మొనఁగుచున్నాఁడు) హృదయేశ్వరీ! ఏమి? ఇంమలఁకుఁ గూడ సందేహమేమి? ఈమాత్రపు బనికే వ్రతభంగమా? శక్తిపూజలో మధుపానముఁదొ్రసివేయుఁదగి నది కాదే? నికుఁబనికిరాదుగాక నాకొఱకు. చూడు నీ కొఱకు—నీ ముఖారవిందసందర్శనము కొఱకు—నీచరణ సన్నిధినుండుకొఱకు నేను సభకైనఁ బోవుటలేదే! నీయాజ్ఞననుసరించి నీమందిరము విడిచిపోవుట లేదే—ఈమాత్రపుఁబనికి సందేహమా? ఇంత విధేయునియెడల నింతియవిధేయత, కాదు. ఇంతనిష్కారుణ్యము తగునా? ఇదియైన నీవు నేర్పినదేకాదా? చండికాపూజాసమయమునఁ బ్రత్యహము నీవెంగిలి చేసియిచ్చుట యాచారమేగదా? ఇందుఁగ్రొత్తయేమి? సందేహమేమి?

చండి—తొందరయేమి? (త్రాగక త్రాగునట్లునటించి) ఇదిగోఁబుచ్చికొనుఁడు (ఇచ్చును)

గిరి—(తిరుగఁ ద్రాగుచున్నాఁడు)

ధీర—(ప్రవేశించి ఆత్మగతము) అబ్బ! కొరనాసికడంగొట్టు దుర్గంధముకన్న మిన్నయగు నీకంపేమి? హా! మహారాజు మధుపాన మొనర్చుచున్నాఁడు. హా! ఎట్టి మధువునేర్పినది! అమధువు గబ్బుగాఁ బోలు నిది! హా! దయ్యపుఁబుట్టుక! రాకాసి రూపు! రాతిగుండె! (ప్రకాశముగా) మహారాజేంద్రా! జయము! జయము.

గిరి—ఓహో! ఏమి యీ మాధుర్యము.

ఆ. వె. తేనెకన్నఁ జెఱకుఁబానకమ్మునకన్న
మదిర మదిర యధిక మధురతరము
మహిత మధురతరము మానినీ మధురాధ
రామృతమ్ముఁగలసి నట్టిమధువు

ధీర—రాజచంద్రా! నేనమాత్యుఁడను.

గిరి—ఓహో! అమాత్యుఁడవా! అమాత్యుఁడవైన నమా
వాస్య యెప్పుడు? పంచాంగము లేకుండఁ బ్రవేశ మెందులకు?

ధీర—రాజేంద్రా! నేనమాత్యుఁడను.

గిరి—నీవమాత్యుఁడవు! సరి! మాత్యుఁడవైన నీకడనున్న
మాహాత్మ్యమేమి? మద్యము నింతకన్న మజాగా సురనింతకన్న సరస
ముగ మధువునింతకన్న మధురతరముగ మార్చఁగలవా! కాక త్యుఁడవా
త్యుఁడశబ్దమునకుఁ దొంగసేద్యపదమా! తొండవైనఁ దోయజాత్యు
లున్న స్థలమున కేలవచ్చితివి? కబ్బాగు? తురక దొరలకుఁ బెటక వార
లకు వాద్యత్తురములో నే భేదము? లేక డవావా? వహవా? అయినఁ
జండికంబోలు చండికరాన్వయాంబుధి చంద్రికల సౌందర్యవార్ధి
చంద్రికల మాపరిశ్కాలోనికి మాకౌఁగిలిలోని కేమైనఁ దార్పఁగలవా?
ఏమి? మాటాడవేమి?

ధీర—హా! ఏమి ప్రసంగమిది! రాజచంద్రా! రాజచంద్రా!
నేను మంత్రిని. ధీరమల్లుఁడను.

గిరి—ఓహో! ధీరమల్లుఁడవా! మంత్రిచంద్రుఁడవా! ఊ! అయిన
నెందులకు వచ్చితివి? ఏమి కార్యము? ఏమి యవసరము? ఏమి యావశ్యకము
ఏమిపని? చెప్పవేమి? అదిగో మామాటలు వినుటకు గాని మధుపాత్రము
వంక గ్రుడ్లు వెళ్ళఁబెట్టుకొని నిరీక్షించుచుంటివి. తప్పులేదు లే—మహా
రాజేంద్రులకేమి, మంత్రిచంద్రులకేమి మదిరపైని మదిరేక్షణలపైని
మనసుపోవుట మర్యాదయే. ఊ. ఇదిగోఁ బుచ్చుకొనుము. పాపము.
గుటకలు మ్రింగుచుంటివి నోరూరుచున్నది కాఁబోలు ఊ —కాని
యొకమాట ఇచ్చితినని సాంగముగ మ్రింగివేయకుము సుమా! పుచ్చు
కొనవేమి? బిగదీసికొనుచుంటివా! చల్లకువచ్చి ముంతదాఁచు కొను
చుంటివా? సందేహమెందులకు? ఓయీ ఒకసారి సేవించి చూడుము!
పెమ్మట మేము వలదన్నను నీవు వలదనవు.

ఆ. వె. మొట్టమొదట వేశ్య మొత్తఁ ద్రొక్కుడుదాఁక
నుంకుగొంకు పైసి నుదధి క్రుంకు.
పెదవిదాఁటువఱకు బెదరు మధుపుఁ గ్రోల
నవలనాశ సమ్ము సట్టిదాఁటు.

దాని మజా యట్టిది. దాని తీపియట్టిది. దాని సత్త్వ మట్టిది. దాని మహత్త్వ మట్టిది. ఏమి! వలదా. ఆవల నీవఱచిచ్చినన లభింపదుసుమా!

ఆ. వె సొంగఁ బీల్పు వేళ సురఁ ద్రావు వేళ్యము
ర్చాదఁ బ్రొక్కువారి కందియిచ్చు
టందువలనఁ ద్రావుమని వేడుకొనుచుంటి
గాక యెక్కువగుట గాదుమాను.

ఇంతగాదు ఇంకిఁక త్రావుట కైన మేము సమర్థుల మేసుమా? చూడు. పాన గోష్ఠి కలంకును బడుకటింట్లయందును సిగ్గుపడిన వాని నోట నట్టి శౌర్య మేసుమా! మఱచితివి.

గీ. ఇతిరుఁ డానిన దానినే నెట్టులాన
నంచు నీవు సందేహమ్ము నందెదేమొ?
పంకజాక్షి మోవికి మద్యపాత్రిమునకు
లేదు సరసుల కెంగిలి లేశమేని

ఏమి? వలదా? వలదా! వలదా!

ధీర—మహారాజేంద్రా! ఎంత చెడిపోయితివి? మధుపానము మహా పాపప్రదము గాదా?

గిరి—పరమామృతి పానము పాపప్రదమా! ఏమనువు చెప్పి నాఁడు? మందమతి మనువు! మాఱుమనువు మనువు! సురలు మెచ్చిన సురఁద్రావుట పాపప్రదమా! నీ మొగము గాదా? ఎలుఁగుబంటులకు బంటులకునిది దైవమేర్పఱచిన దివ్యాహారము గాదా? వెనుకటివారికన్న

నీవు వెలుఁగఁ బెట్టిన దేమి? బుద్ధిసాగరునిఁ బోలుబుద్ధిమంతుఁడవు గాఁ
బోలునే! మహాప్రతిభా శాలివగు మంత్రిమాళివి గాఁబోలునే! సకలశా
స్త్ర పారంగతుండవగు సచివోత్తముండవుగాఁబోలునే! ఇదియా నీ తెలివి
ఇదియా నీలోకానుభవము? ఓ తెలివి తక్కువ దేవయ్యా! బ్రహ్మాండ
పురాణ బసవ రాజీయమునఁ బ్రథమాశ్వాసమునఁ బంచమాంకమునఁ
బ్రకరణారంభమునఁ బ్రహ్మర్షి చంద్రుఁడు. ప్రథమాంధ్ర మహాకవి
భట్టభాణుఁడు హాలాపాన మమరలోక ప్రథమసోపానమని, యిఱువది
యాఱు మత్తేభగర్భ చంపకవృత్తములలో వాందమతుల మందలింప
లేదా? హీ! హీ! హీ! ఏమి! భాషాపాండిత్యము! భట్టమూర్తి బావు
రుమని యేడ్చినన్నటులున్నది మద్యప్రభావంబన నేమనుకొనుచుంటివి

ఉ. పండిత సింహులయ్యెదరు పామరులేనియు దీని వానినన్
ఖండన భీములయ్యెదరు పందలయేనియు దీనిఁ గ్రోలినన్
షండులు సైతముం బురుషచంద్రములయ్యెదరిద్ది త్రావినన్
బాండితియుం బరాక్రమము బౌరుషముం సురయే యొసంగెడున్.

మఱియు నెందఱెందఱు మహనీయులు మదిరాపాన మొనర్చి కృతార్థు
లైనారు?

సీ. మద్యమానియగాదె మధుసూదనుఁడు మున్నుఁ
బాండు తనూజులఁ బట్టిచాఁపె?
సురఁద్రావియేగాదె. శుద్ధోదనుఁడు వీకఁ
గర్ణునిఁదన యుఱకాలరాఁచె?
కల్లుఁగ్రోలియుఁ గాదె కనకకశిపు బల్మిఁ
గుంభకర్ణుండట్టె కూలఁదన్నె?
మదిరగొనియుఁ గాదె. మత్తుఁగఁడు చైద్యుండు
బలరాముఁ జటికెలో బిలుకుమార్చె?

గీ. కనుఁగవ చూచియో కాదె! వేనవేల
గొల్లపూఁబోండ్ల మెప్పించెఁ గూడి శుకుఁడు.
దీనిరుచి! దీనిదగుమజా! దీనితీపి!
దీని మాహాత్మ్యమెఱుఁగుఁబో దేవుఁడొకఁడె ?

మద్యము రసికైకవేద్యము సుజనలోక హృద్యము మము బోఁటి దేవతా విగ్రహములకు నైవేద్యము. మిముబోఁటి ఛాందస విగ్రహములకుఁ బథ్యము తథ్యము. చండికా! నాకు సన్నగిలినది. ఏది మఱియొక గిన్నెడు తెప్పింపుము.

చండి—(ఆత్మగతము) నేనింక లేకున్న నీమంత్రి యేమిక్రి క్కునో! చాటున నుండి వినిపోయెద (ప్రక్కకు నిష్క్రమించుచున్నది)

ధీర—హా! మహారాజేంద్రా! నిందాకరమగు నీమదిరా పానమేమి? ఈఘోరనరకలోక నివాసమేమి? ఈభయంకరమ్మాత్య కాంతా సాంగత్యమేమి? అయ్యో! అయ్యో! రత్నము జయమయ్యెనా బంగార మంగారమయ్యెనా! పారిజాతము ఘోరసర్పమయ్యెనా. హా! ఎంతటి జాఁడొట్టి వాఁడయ్యె !

సీ. పరసతిఁదల్లిగా భావించు వానికి
కలుషవర్తన మెట్లు గలిగెనయ్య!
తమ్ముని యిల్లాలు దనకుమారింబోలు
నను ధర్మవేదియు నరయవయ్య !
పావన మల్లభూపతి వంశసత్కీర్తి
బుగ్గిలోఁ గలుపంగఁ బూనితయ్య!
రాజట్టు లొనరింప రట్టడివారలు
నలుపు చెయ్దము లాప శక్యమయ్య!

గీ. పడుచుఁ బ్రాయమునందు నేపాపమెఱుఁగ
కార్జనము సేసికొన్నట్టి యమల యశము
దల వరసినట్టి యీముదసలితనమునఁ
బాడొనర్చుకొనుట యెట్టి పాడియౌ నృప!

రాజేంద్ర ! రాజేంద్ర! నిఖలనీతి కోవిదుఁడవు, సమస్తనీతిశాస్త్ర పారంగతుండవు సదమలసుల్లవంశసంజాతుండవు ధర్మము నాల్గు పాదముల నసువఁడగిన బుద్ధిమతుఁడవు నేఁటికి నీకిట్టి బుద్ధియా! ఆహా! కన్నబిడ్డఁబోలు చిన్నితమ్ముని ల్లాలుఁ బరిగ్రహింపఁబ్రయత్నించుచుంటివా! ఇంతకన్నఁబాపమింతకన్న ఘోరమింకొకటి యున్నదా! మహారాజా! మఱియొకమాట చండిక నీపై మోహమున నిట్లుగావించుట లేదు. నిన్నుబుట్టలోఁ బెట్టి, నీవలన నధికారమంతయుఁ జిక్కించుకొని నిన్నుమట్టుపెట్టి భర్తను బ్రభువుం జేయఁ బ్రయత్నించుచున్నది. నీవిది యెఱుంగక మాయంబడిపోవుచున్నాఁడవు ' అయ్యో! ఈకామినీ రూపమృత్యుదేవతను—ఈకామినీరూపబ్రహ్మరాక్షసిని — ఈకడ్డిగప్పిన మహాకూపమును—ఈరూపమెత్తిన మహాపాపమును—ఈపయోముఖ విషకుంభమును—ఈ గోముఖవ్యాఘ్రమును—ఈ శాకినిని ఈ ఢాకినిని—విశ్వసించుచుంటివా ! వలదుసుమా ! చెడిపోయెదవు సుమా !

గిరి—ఆ! ఆ! అంతటితో నీగ్రంధమును గట్టిపెట్టుము. అట్టిచదువకు ఓయీ! బుద్ధిహీనుఁడా! నీకునోరున్నయెడల నీ యిష్టమువచ్చినట్లు నన్నుఁదిట్టు నీకుశక్తియున్న నామూతిపండ్లు విఱుగఁగొట్టు. గుద్దు చంపు. పొడువు నఱుకు. తన్ను. చేఁతగాకున్న గొంతుకనురిఁబెట్టుకొని చావు. అంతేగాని నావగలాఁడిని, నాముద్దులాఁడిని, నావలపులాఁడిని నాపూబోఁడిని మాత్రము చిన్నమెత్తుమాట జాఱితివా నీపరువు

దక్కదు. జాగ్రత! నీగుండెలలో నిద్దురవోయెదను. హే. హే. హే. ఏమనుకొనుచుంటివి?

ఆ. వె. తన్నుఁదన్న సైఁచు మన్నగొన్నఁ సైఁచు.
దిట్టసైఁచుఁబట్టి కొట్టసైఁచుఁ
దానహింపఁ గలఁడె త్రాగుఁబోతు రసిక
వరుఁడుముద్దుటాలి నోరుఁజేదుమాటఁ

చండి—(ప్రవేశించి మధుపాత్రి మొసఁగి) సేవకమీఁదు చేసి నదేమి?

గిరి—(త్రాగుచు) మిన్నకుండుమా! మైకముదగ్గుటచే సారవదగ్గినది. ఇప్పుడుచూచితో! ఓయీ! నీయుద్యోగము నూడఁబీఁకితిమి నీవీనాఁడే యాలుబిడ్డలఁ దీసికొని యూరువిడిచిపొమ్ము. చండికా! ప్రేయసీ! అమాత్యపదవికి సర్వులు లభించువరకుఁ దత్పదంబు నీవే చూచుచుండుము

చండి—చిత్తము.

ధీర—

ఆ. వె: నాయమాత్యపదము నామాతృదేశమ్ము
పీడుటకు నెడంద నోడఁబోను.
మాయలాఁడి చెడిపెటూరి చేతులస్వామి
విడువవలసెనంచు వెఱతు నేను.

(ప్రకాశముగ) రాజేంద్రా! నేనింక సెలవుఁదీసికొందును. నా కడవాక్యముల నాకర్ణింపుము.

సీ. చెడుమిత్త్రిఁ, దేనెఁబూసిన కత్తి, నీసత్త్రి,
క్షితినాథ మదివిశ్వసింపకయ్య!
నినుఁగాక నీచిన్నితనయునిఁగూడని
ర్మ్మారిహరించు నేమఱకుమయ్య!
పాపప్రదము సురాపానమ్మొ యీచేటు
నకుమూలమద్ది మానంగదయ్య!
పైతృకంబైన యీపావనరాజ్యమీ
రంపెలాఁడికి నప్పగింపకయ్య!

గీ. జనముఁ లేమనుచున్నారో వినఁగదయ్య!
పాపపున్ నిందఁగోర్పుట భావ్యమయ్య!
మానఁగదవయ్య! యీబుద్ధి మానుమయ్య!
ఏ నిదేయేగెదను సెలవీయుమయ్య!

గిరి—ఊఁ హుఁ. నీ మొదటి వాక్యముల మన్నింపము. తుదివా
క్యముల మన్నించితిమి. సెలవిచ్చితిమి. ఊఁ. మొదట నాపనిఁగానీ.
పో. పో. పో.

ధీర—చిత్తము (నిష్క్రమించుచున్నాఁడు)

గిరి—దయ్యము వదలినది.

చండి—నిశ్చయముఁగ!

గిరి—నిస్సంశయముఁగ! ప్రేయసీ! అదిసరిశాని యింక నెన్నా
ళ్లకు నీవ్రతపూర్తి? నామనోరథపూర్తి?

చండి—దగ్గఱకు వచ్చినది—ఒక నెల.

గిరి—ఒక నెల? అబ్బ! ఒక మాసము. రెండు పక్షములు. నాలు
గు వారములు. ముప్పదిదినములు. నూటయిఱువది నూటయిఱువది
జాములు. కోటిముప్పది గంటలు! అబ్బ!

చండి—నాకును దుస్సహాహ్యముగనే యున్నది. ఏమిచేయుదము. అదిగో! పెద్దమ్మగారి దాసి!

(దాసిప్రవేశము)

గిరి—పెద్దమ్మగారిదాసి పెద్దమ్మగారివలెనే యున్నది.

చండి—ఓసీ! ఏమే!

దాసి—అమ్మా! దేవిగారు మరణావస్థలోనున్నారు.

గిరి—ఇంక నున్నారా! వైద్యుఁడింక నెంతకాలము బ్రతుకు నని చెప్పినాఁడు?

దాసి—ఈరాత్రి జీవించుట దుర్లభ మనుచున్నాఁడు

గిరి—తెలివి తక్కువదేబెగాడిద ఈరాత్రివఱకె నెందులకు? విషగుళిక నొక్కటి వినువలేక పోయినాఁడా! మందువేయలేక లసక వస్థ. మధ్యమున వినలేక మూకవస్థ. ఇటునటు దిరుగలేక నీకవస్థ. మరి ణావస్థ! మరణావస్థలో నున్నదా! మంచిదేకదా! అయిననేమి?

దాసి—ఒక్కసారి మిమ్ముఁజూడఁగోరుచున్నారు.

గిరి—రాజుగారు రాజ్యకార్యాంతరవ్యగ్రులై రవ్వంతయుఁ దీఱికలేక యున్నారు. దహన సంస్కారము దప్పనిసరియైన దగ్గఱ నుండి చేయించుటకు దయసేయుదమని చెప్పినారని చెప్పుము. పో!

దాసి—చిత్తము. (నిష్క్రమించుచున్నది.)

చండి—(ఆత్మగతము) ఈపీడగూడ వదలుచున్నది. వైద్యుఁడు మా యాజ్ఞననుసరించి యిప్పటికే చేయఁదగినంత పనిఁజేసినాఁడు. ఇఁకఁ దక్కినపనిఁ జేయఁగలఁడు. నిస్సందేహము.

(యవనిక పడును)

## తురీయ రంగము.

ప్రదేశము. మంత్రిమందిరము ముందటిస్థలము

(ప్రవేశము. ధీరమల్లుఁడు)

ధీర—(ఆత్మగతము) హా! దుర్విధీ! నీచెయ్వులఁ దలంచికొన్న గుండెలవియుచున్నవి?

ఉ. అంచిత ధర్మమార్గరతు నార్యు, మహాత్ముని, బ్రాహ్మణోత్తముం
గాఁ వించితి, మారిమాయఁ బడవేసితిఁ ద్రోచితి పాపవార్ధిఁగా.
గొంచెపుబుద్ధిఁజల్పితివి కూర్పితిఁ జెట్టలనింక గొంతుఁగో
యుంచెదో! యేమిచేసెదవొ యీ పరమాలుంగుడు మాలదైవమా!

ఎంతటిసాహసిక యీ పెనభూతము? ఎంతటి నెఱజాణగాని దింతటికాలాహిని బుట్టలోఁ బెట్టినది? ఎంతటి జగజంతగాని దింతటి యుగ్రసింహమును గ్రామసింహమునుంబలె నడుగుజాడలనడపించు కొనుచున్నది? ఎంతటి మాయలాఁడిగాని దింతటి మత్తగజమును మచ్చికచేసికొని పశువుంబలె నిటఁగట్టి పడవైచుచున్నది! హా! ఈపురగిరిరాజ పురందరునకెట్టి దురవస్థగలుగనున్నదో! ఈపురగిరి రాజ్యమునకెట్టి కీడు మూడనున్నదో! ఈరాజ్య ప్రజలకెట్టి చెట్టపట్టనున్నదో? ఇదియెల్ల నిటులుండఁ బురగిరిరాజ వంశాంకురము పురగిరికి ముందుముందు నేలికగాఁ బోవు నాయుమ్మంతుఁడు, పసిపాప, కసిగందు, విజయేంద్రమల్లునికెట్టి యుపాయము రానున్నదో! దైవమా! ఏమిచేయుదును! చేతగాక భూతలనాథు నాపులివాతఁ బడవైచితిని—ఈపాలపాపనిఁగూడ నాభూతమునకర్పింపహా! ఇంకున్న నాకుమారు నీరాకాసి బ్రదుకనిచ్చుట కల్ల. దేవిగారితోఁజెప్పి విజయేంద్రమల్లునిఁ దప్పింపవలయు. ప్రయాణమున కాయత్తమొనర్ప వీరపత్నికెఱింగించి యంతఃపురమున కేఁగెదఁగాక (ప్ర) ఓసీ! దాసీ!

దాసి—(ప్రవేశించి) దేవా! ఏమి సెలవు.

ధీర—వీరపత్ని యెక్కడ!

దాసి—దేవా! పట్టమహిషిగారు మరణావస్థలోనుండి మిమ్ము నమ్మగార్చిని రమ్మని కబురంపిరి. మీకీవార్త దెలుప నాకాజ్ఞయొసఁగి యమ్మగారు రాజేంద్రమల్లునిగారితోఁ బల్లకి నెక్కియంతఃపురమున కేఁగిరి.

ధీర— పట్టమహిషిగారు కబురంపిరా. మంచిది నీవుపొమ్మ (దాసినిష్క్ర) ఆతల్లి మనోవ్యథం జేసి మంచమెక్కినది-ఇంక బ్రదుకుటకల్ల! నేఁడేకడపారి చూపుగదా! చూచి కుమార రక్షణమున కుపాయమాలోచించెద ఆమెకబురం పుటయుఁగలసి వచ్చినది—

(నిష్క్రమించుచున్నాఁడు.)

పంచమ రంగము

ప్రదేశము. అంతఃపురము

(పవేశము ధీరువ్రతు దాసీలు చెలికియొకవంకఁబట్టుకొని దేవిని సెజ్జపైఁ గూర్చుండఁబెట్టి యుందురు—దాఁపునవీరపత్ని రాజేంద్రమల్లుఁడు నిల్చియుందురు.)

దేవి—దాసీ!దాసీ! నాదైవము, నాస్వామి నామనోనాధుఁడు నా జీవితేశ్వరుఁడేమనినాఁడు? దహన సంస్కారము దప్పని సరియైన దగ్గఱనుండి చేయించుటకుదయచేయుదుమనియా! హా! అభాగ్యమైన నాపాటి యదృష్టమైన నీ నికృష్టపు జన్మమునకున్నదా? అక్కటా! మహాప్రభూ! ఎంతటి నిర్దాక్షిణ్యము! ఎంతటి కార్పణ్యము, ఎంతటి బెడిదపుఁబగ! నీచరణదాసి, నీసేవకురాలు, నీదాసిన నీకేమి యొగ్గు గావించినది? ఎట్టి పాప మొనర్చినది. అక్కటక్కట! హృదయేశ్వరా! అగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యర్ధాంగలక్ష్మి—పట్టమహిషి.

యని చచ్చువఱకుఁ జేరు వెలుఁగఁ బెట్టికొనిన గృహిణి—ఒకమాస మునకుఁ బూర్వమువఱకుఁ బ్రాణప్రదముగఁ నీవుమన్నింపఁ దగిన ధర్మపత్ని—నీవు పరకాంతా లోలుఁడ వైతివనికాదు, అపకీర్తిభాజనమ వైతివని నలువురి నోటిలోఁబడిపోవుచుంటివని, మనోవ్యథతో మంచ మెక్కి మదినీయెడ మమత విడనాడ నేరక, చచ్చుటకు సిద్ధముగ నుండి తుదిసారి నీవదనారవిందమును సందర్శించి కృతార్థ గావలయునని దీనతతో సందేశమంప నిట్లు నిరసింతువే ఇంతటి నిష్కారుణ్యము వహింతువే! ఇట్లు నాయాశ నడియాస గావింతువే! ఇంతటి బెట్టిదవుఁ బగసాధింతువే! మనోహర! నిన్నేమనియందు? నాదుష్ప్రాప్తిని నాప్రా రబ్ధమును నానుదుటిగీఁతను, ఆపాపిష్ఠి విధాతను, నెంతనిదూఱుకొందు? అమ్మా! తల్లీ! చండికా! అదృష్టవంతురాలా!. నీకైన నీదీనురాలిపై నింతకనికరము గలుగదయ్యెనా! నీవైనఁ బ్రాణేశ్వరునితో నొక్కసా రిపోయి, ఆనిర్భాగ్యురాలి నాదురదృష్ట వంతురాలినిఁ జూచిరమ్మని యింతమాత్రము చెప్పలేక పోయితివా తల్లీ! నీమాట నీమనోవిభుఁడు గాదనఁ గలఁడా! పోనీనీకంత భయమైన, నాథుని నేను మందులుపెట్టి మలుపుకొందునని యనుమానము దోఁచిన నీవేయతని వెంటఁబెట్టికొని వచ్చి, యొక్కసారి నాపాపంపుఁ గన్నులకు నాదైవమును గనంబఱచి నీవుకూడ నీయకించనురాలిని ఒకకాలమున నీవలె నాథుని యనుగ్ర హమునకు భాజనమై యిప్పుడధోగతిపాలై మరణావస్థలోనున్న యీదు రదృష్ట వంతురాలినిఁ జూచినీపతిని వెంటఁబెట్టికొని పోలేకపోయితివా! తల్లీ! అట్లుచేసియున్న నీకట్టి కొంతవఱకుఁ దరించియుండునే? నీకును బుణ్యమబ్బియుండునే! నీయుపకారమునకు నీచరణములంటి కృతజ్ఞత జూపియుండునే! తల్లీ! ఈమాత్రపుమేలు నేయలేకపోయితివా! అమ్మా!

ఇప్పటికైన నీకుఁగనికరముగలుగరాదా! నాప్రాణనాథుని వెంటఁబెట్టుకొనివచ్చి తిరిగిపోరాదా! తల్లీ! రారాదా!

దాసి—అమ్మా! ఈ నీయవస్థకు నీమనోహరుని నిష్కారుణ్యమునకు నాకామినీభూతమే కారణము. ఆపిశాచికిఁ గరుణయేమి? ఆమె రాజుగారిని వెంటఁబెట్టుకొని వచ్చుట యేమి? ఇంతకు నిపుడా యనగారు వచ్చినమాత్రమేమి లాభము.

దేవి—దాసీ! ఇప్పుడు రాజుగారు వచ్చిన మాత్రమేమి లాభమను చుంటివా? లాభము లేకేమి తల్లీ! లాభము లేకేమి?

సీ. ప్రాణేశ్వరుని ముఖపద్మమ్ముఁ గనుట కీ
జన్మాన నిదె కడసారిగాదె?
హృదయేశు పదములు స్పృశియించుటకును నీ
జన్మాన నిదె కడసారిగాదె?
ప్రాణనాయకుముద్దు పలుకులు వినుట కీ
జన్మాన నిదె కడసారిగాదె?
జీవితేశ్వరు చెంత సెలవు గైకొంట కీ
జన్మాన నిదె కడసారిగాదె?

గీ. మరణ వేళను సతులకు వరుని మొగము
గనుటకన్నఁ దచ్చరణముల్ గనుటకన్న
కొనుటకన్నఁ దద్వాక్యముల్ వినుటకన్నఁ,
బతి సెలవుఁ గొంటకన్న, లాభంబు గలదె?

అదియునుం గాక.

చం. తొడలఁ బరుండబెట్టుకొని తోరపు వేడుకఁ బ్రాణనాయకుఁ
డుడుగుము చింత, ప్రాణములకు న్నదె యీవలవంత యంచునూ
అడలఁగఁ బల్కు, చశ్రువుల రాల్చుచుఁ జెక్కుట నోటనొక్క గం
టెడు తులసీరసమ్ము ధరణీపతి పోసినఁ జాలదే చెలీ!

మఱియును

గీ. ఉవిద! భర్తృ పాదక్షాళనోదకంబు
కామకాయుష్యమిడు నమలామృతంబు.
చెలియ! వరుచేతివర తులసీరసమ్ము
సతికిస్వర్గసౌఖ్యముఁగూర్చు సత్పథమ్ము

వీర—హా! తల్లీ! ఎంతటి నిష్కల్మష హృదయము! ఎంతటి పాతివ్రత్యము!

దాసి—అమ్మా! కానిపోని యాశలతోఁగలఁత నొందకుము.

దేవి—కానిపోని యాశలా యివి! హా! ఈనాపాపంపుఁ గన్నులకు ప్రాణేశ్వర వదనపంకజసందర్శనభాగ్యమింక వట్టిదే? ఈనాపాడు చెవులకు హృదయేశ్వరు మృదువాక్యశ్రవణసౌభాగ్య మింకఁగల్ల యే? నాయీ నికృష్టపుఁ జేతులకు మన్మనఃకాంతిచరణపల్లవస్పర్శన భాగ్యమింక గగనకుసుమమే? ఈదురదృష్టపుఁ గట్టెకు నా దైవముచేతి తులసీరసమింక నందని మ్రానిపండే! అయ్యో అయ్యో! అయిననింక నాహృదయమేల బ్రద్దలుగాదు? నా ప్రాణము లేలయెగిరిపోవు?

వీరపత్ని— అమ్మా! ఊఱడిల్లుము—

దేవి—ఊఱడిల్లక నేనుఁజేయునదేమున్నది? దైవమా! తుట్టతుదకు నాకెట్టిగతిపట్టినది? నాగతి కేమి? నాపసిపాప గతి యేమి?

దాసీ! నాతండ్రియెక్కడ?

దాసి—అమ్మా! కొనివత్తును. (నిష్క్ర—)

దేవి—హా! తండ్రి విజయేంద్రమల్లా! నీకెంతటిదుర్గతి పట్టినది. నీకింక దిక్కెవ్వరురా తండ్రీ!

సీ॥ బాబాచిరాయన్నఁ బరుగెత్తి కొనిపోయి
            యమ్మఁజేరెదు నమాయకపు శిశువు.
తినుబండ మేరిదండనునుంతునో వారె
            విహితులంచుఁ దలంచు వెత్తికట్టి
తనుఁజూచి యేమైనఁ గనులెట్టఁజేసిన
            బిక్క మొగము వైచు పిచ్చితండ్రి.
ఎఱుఁగని వారెవ్వరేఁ జేరఁదీయ గ
            గ్గోలువడుచు నేడ్చు బేలబుడుత.

గీ॥ తాఁకినం గసికందు రక్తంపుముద్ద
నిన్న మొన్నఁ బొల్మఱచిన పిన్నిపాప
నన్నుఁగన్నయ్య. నాయన్న, నాదుపట్టి
యేమిగానుండెనో విజయేంద్రుఁడింక.

దాసి—అమ్మా! అందఱకుదిక్కు మలహారుఁడే యున్నవాఁడు. మఱియు మీయప్పగారింబోలిన యీయమ్మగారును, అన్నగారింబోలిన యమాత్యులవారు నున్నారు. మీకేమిభయము?

(ప్రవేశము—ధీరమల్లుఁడు)

దేవి—అన్నయ్యా!అన్నయ్యా! వచ్చితివా! నాయవసానమును జూడవచ్చితివా!

ధీర—హా! పురగిరిరాజ్యలక్ష్మి! నీకెట్టియవస్థ సంభవించినది.

దేవి—నాయవస్థకేమి! నాకుమారుని యవస్థ!

(ప్రవేశము దాసి. విజయేంద్రమల్లుఁడు)

ధీర—అమ్మా! నామేనఁ బ్రాణములుండువఱకు భర్తృదార కునకువచ్చిన భయములేదు.

దేవి—అగ్రజా! నేనింక నిర్విచారముగఁ బ్రాణమువిడిచెదను.

నాకాయాన మంతకంతకు నధికమగుచున్నది. నాయనా? విజయేంద్ర
మల్లా! ఇటురాతండ్రీ!

విజ—(దగ్గఱకువచ్చును)

దేవి—(చేరఁదీసికొని ముద్దులాడుచు) నాయనా! నాతండ్రీ!

సీ॥ నినుఁజంకనిడుకొని నిరతమాడించెడు
భాగ్యమీకట్టె కీపైనిలేదు
ముదమారనీముద్దు ముచ్చటల్ గనుగొను
భాగ్యమీకట్టె కీపైనిలేదు.
బుజ్జగించుచునిన్ను బోనమ్ముదినిపించు
భాగ్యమీకట్టె కీపైనిలేదు.
చదువుసాములఁజూచి సంబరంబునఁబొంగు
భాగ్యమీ కట్టె కీపైనిలేదు.

గీ. నిన్నుయువరాజు గావించి నీదుతండ్రి
పెండ్లి పేరంటములఁ జేసి ప్రియమునంద
నిరుపమానంద వార్ధిమునింగి తేలు
భాగ్యమీపాడు గట్టెకుఁ బట్టబోదు.

నాయనా!

గీ. తండ్రి యుండియు నుండని దారి గలిగెఁ
దల్లికాలవశమ్మునఁ దరలుచుండెఁ
దల్లి దండ్రియు నీపయిందననయనీకు
వీరలే, వీరిభక్తి సేవింపుమయ్యా.

విజ—అమ్మా! ఇదియేమి ? నీవునన్ను విడిచి పోయెదవా
వీరికప్ప గించు చుంటివా! నేను వీరితోఁబోను.

దేవి—(కన్నీటితో) నాయనా! పోతున్నావా? నీతండ్రి యా మాయలాఁడి వలలోఁ జిక్కియున్నాఁడు. నీక్షేమము గనుఁగొనకున్నాఁడు. ఆరాకాసి నన్నుఁదన పొట్టఁ బెట్టుకొనుచున్నది. నీతండ్రిగారిని గూడ నది బ్రదుక నీయదు. నిన్ను మాత్రము బ్రదుక నిచ్చునా నాయనా!

విజ—అమ్మా! నీమరణమున కామెయాకారణము! తండ్రిగారిని గూడ బ్రదుక నీయదా! ఇన్నాళ్లనుండి నాకివార్త నేల తెలుపవైతివి?

గీ. తల్లి నిట్లు చేసి, తండ్రి నట్టులు సేసి,
నన్ను మన్నిగొనఁగ నున్నదాని
ఆదురాత్మురాలి, నాదుష్టురాలి, నేఁ
జంప నేని నాదు జన్మమేమి?

దేవి—నాయనా! నీవు పసివాఁడవు! ఏగోడు నెఱుంగని వాఁడవు. ఎందులకుఁ దండ్రీ! యాదుష్టురాలితో శత్రుత్వము!

గీ. పాపఁడనయాదునైనఁ బ్రభవమంది
నట్టి యన్వయంబమ్మ! శూరాన్వయంబు
తెలియనే గోడునైన వైరుల నడంచు
గోడుమాత్రమెఱుంగని వాఁడఁగాను.

ధీర—అమ్మా! కుమార విజయేంద్రుని వాక్యములకు మీరాశ్చర్యపడుచున్నట్లున్నారు. ఇందాశ్చర్య పడవలసినయావశ్యక మేమియులేదు. ఏమన?

గీ. మానునకు నీతిపుట్టుపుతోన వాడము
శౌర్యమబ్బు జన్మముతోన క్షత్రియునకుఁ
బుట్టుతోన కారము మిర్యమునకుఁ గలుగు
రాజసుతునకు జనితోన తేజమొందవు.

దేవి—నాయనా! నీవుపెద్దవాఁడవై పగఁదీర్చుకొన్న మాకం తకన్నఁ గావలసిన దేమి? కాలమువచ్చువఱకు వీరి మఱుఁగునఁ దలఁ దాఁచికొనుము. (విజయేంద్రమల్లుని మంత్రి చేతులఁబెట్టి)

గీ. అన్న యెట్లుమన్నింతో? నాయనఁగఁబట్టి
నీయనుఁగు బట్టినట్లు మన్నింపుమయ్య!
తండ్రి యొటుమెలంగెదొ మంత్రి దరిని నీవు
భయము భక్తిని జూపుచు బ్రిదుకుమయ్య!

(విజయేంద్రుని వీరపత్ని చేతుల నిడి)
అమ్మా! వీరపత్నీ!

గీ. కడుపుఁదీపి నెఱింగిన పడఁతివీవు
ఎట్లు మన్నింతో పట్టివచింపవలెనె?
నాదు సుతుఁడుగాఁడితండు నీదుసుతుఁడు
వీనిఁ బోషింపుతల్లి! సాధ్వీమతల్లి!

అమ్మా! వీఁడది గావలయు నిదిగావలయునని పోరుపెట్టుచుం డును. వినువందక యొదవిన దోసఁగి యొదవని వస్తువున కేడ్చుచున్న బుజ్జగించి మఱపించి కనికరముతోఁ బెంచుకొనుము నాయనా! విజ యేంద్రా! నన్నుఁబోలె వీరి నది యిది తెండని యేడ్పింపకుమా! (వీరపత్నితో ధీరమల్లునితో)తల్లీ! తండ్రీ! నాతుదివాక్యముల మఱ వకుఁడు.

సీ. పసికూన వీఁడే యశుభముశుభ మెఱుఁగఁడు
తల్లియుఁ దండ్రియు దారి దెసయు
మీరనుండీ యీకుమారకు నకు నింకఁ
దనయునిఁ గా వీనిఁ దలఁపుఁడయ్య!
విద్దెల బుద్ధులఁ బెద్దను గావించి
దిక్కులేని కొఱంత దీర్పుఁడయ్య!
ఒక యింటివానిగా నొనరించి రాజాన్వ
యంబిల నిలుపంగ నరయుఁడయ్య!

గీ. పెద్దయగు పైని రాజు గావింపుఁడయ్య
కన్నులం బెట్టి నాపట్టిఁ గావుఁడయ్య!
నీటముంచిన, బాలముంచినను గాని
యీనిసువు భారమింక మీదేసుఁడయ్య?

ధీర: వీర—అమ్మా! భయములేదు,

ధీర—(ఆత్మగతము) ఈయమాయకపుఁదల్లి నేనింక నుద్యోగమునన్నంటినని కాఁబోలుఁ గుమారుని రాజుగావించుభారము నాపైఁ బెట్టుచున్నది నిశ్చయముగ నాభారము నీకుమారుని నాపెనురక్కసి గ్రింగకుండ రక్షించుభారమును నాదియేకదా? మంత్రిత్వమూడిన సంగతిఁ జెప్పిన నీమె మఱింత గుండెపగులును. ఆవృత్తాంతముఁ దెలుపకుండుటయే మంచిది.

(ప్రవేశము. వైద్యుఁడు, భోజనపుఁ బళ్ళెరము. జలముతో నిండియున్న పైఁడిచెంబుఁ బట్టికొని దాసియు)

ధీర—ఇది యేమి? ఈస్థితిలో భోజనమేమి?

వైద్యు—అయ్యా! భుజింపకున్న మఱింత నీరసము గల్గును.

దాసి—(పళ్ళెరము బైడిచెంబు సమీపమునున్న బల్లపైఁ బెట్టుచున్నది)

(పంజరమునను్న చిలుక యఱచుచున్నది)

ధీర—(సంశయముతో) ఏమిది? చిలుక యెందులకఱచు చున్నది! ఓసీ! దాసీ! వానిపైమూఁతలఁ దొలఁగింపుము.

దాసి—(అట్లుచేయును)

ధీర—(పరిశీలించిచూచి) ఏమిది?

చ. చిలుకయదేల పల్కినదొ చిత్రమువిన్నక?, యన్నమేలకో
నలిపినగట్టిగా విభజనంబొనరింపఁగఁ బోవ ముద్దగా
బొలుచుచుఁ, గేకికంఠమును బోలెఁగనంబడుఁ జెక్కురంగులఁ?
జలమునఁ గృష్ణవర్ణము!, విషంబిడిరిందును నందుకాత్రిపుల్!

అయ్యా! వైద్యుఁడా! నీవుపరిశీలించియే కదాపట్టించుకొనివచ్చితివి? తమరుగూడ నీఘనకార్యమున భాగస్వాములా స్వామి!

వైద్యు—(వణఁకుచు) అయ్యా! నేనేపాపమెఱుఁగను.

ధీర—దేవ! అయినసీవణఁకేమి! ఈచెమటలేమి? ఈముఖవైవర్ణ్యమేమి? ద్రోహీ! దుష్టుఁడా! పట్టమహిషినిట్లు పొట్టఁబెట్టుకొను చుంటిరా? నేరమెవ్వకో నెదవా! అగ్నిచేఁ బరీక్షగావింపు మందునా!

వైద్యు—(అపవారించి) అయ్యా! నేనేమిచేయుదును. ఇది చండికా దేవ్యాజ్ఞ

ధీర—(అపవారించి) ఇదివఱకుఁగూడ విషము నుపయోగించితివా!

వైద్యు—(అపవారించి) లేకున్ననింతటి స్థితి కెట్లువచ్చును?

ధీర—(అపవారించి) చికిత్సవలన లాభము లేదా?

వైద్యు—(అపవారించి) కార్యమిప్పటికే మించిపోయినది

ధీర—(అపవారించి) అవును శరీరమునఁదెలుపు రంగేర్పడినది కృశత్వము గన్పట్టుచున్నది. కన్నులు దిరిగిపోవుచున్నవి. రక్తము సంక్షీణమైనది. ఇంక లాభము లేదు. సరికాని నేనిక్కడకు వచ్చినట్టులు గాని యీదురంత మెఱింగి నట్లుగాని నీవెవ్వరికి నెఱిఁగింపరాదు. నీసంగతి నేను వెల్లడింపను.

వైద్యు—అమ్మయ్యా! బ్రతికితిని నాకిఁక సెలవిండు.

ధీర—మంచిది.

వైద్యు—(నిష్క్రమించును)

ధీర—దేవిగారు స్మృతి దప్పియున్నది. దాసీ! ఈయన్నము నీ యుదకము దూరముగ నొక స్థలమున బొందదీసి యందు బూడ్చివేయుము. ఎవరు భుజింపవలదు. కొనిపొమ్ము.

దాసి—చిత్తము (వానిం గొని నిష్క్రమించుచున్నది.)

దేవి—(కొంచెము స్మృతిఁగల్గి) అగ్రజా! కుమారునితో నాకుఁదులసీ తీర్థమిప్పింపుఁడు. మీరు నొసంగుఁడు.

(దాసి నిష్క్రమించి తులసీరసముఁ గొనివచ్చును)

(విజయేంద్రమల్లుఁడు, ధీరమల్లుఁడు, రాజేంద్రమల్లుఁడు వీరపత్ని పోయుదురు)

దేవి—మలహరదేవా! మలహరదేవా! (అందఱునందురు)

ధీర—(పరికించి) అమ్మగారు ప్రాణముల విడిచిరి.

అందఱు—(దుఃఖింతురు) హా! హా! తల్లీ!

ధీర—దాసీ! పొద్దుగ్రుంకినది. దీపములను వెలిగించి జాగ్రత్తగ నుండుము మనరాత్రి చెల్లనా ఖనఖను వెల్లడింపకుము. నాయనా! ఇటురా! (విజయేంద్రునిఁ జేయిఁ బట్టుకొని భార్యాపుత్రులతో) ముందు నడచును. ఓసీ! దాసీ! రాజకుమారుని మేము గొనిపోయితిమని వెల్లడింపకుఁడు, ఆరాక్షసి భర్తృదారకుని బ్రదుకనీయదు.

2 దాసి—చిత్తము.

ధీర—నాయనా! రమ్ము.

విజ—ఏమి? ఇప్పుడా! నాతల్లి గతించెనే? మంత్రిచంద్రా! మంత్రిచంద్రా!

గీ. ఎన్ని కష్టంబులోఁబడి నన్నుఁగాంచి
పూలపొత్తుల యందిడి పోచినట్టి
కన్నతల్లిఁ గట్టెలనిడి కాల్పవలదె?
యిదియు లేకున్న బుత్త్రులింకేటికయ్య!

ధీర—విజయేంద్రా! అంతవఱకు నాగుటకు వీలులేదు - అపాయము రాఁగలదు. నీకేకాదు మాకును - నడువుము తండ్రీ!

ధీర—(భార్యాపుత్త్రులతో విజయేంద్రునితో నిష్క్రమించుచున్నాఁడు.)

(యవనిక జాఱవిడిచి కొంతతడవునకుఁ దిరుగ నెత్తవలయును. దీపములు వెలుఁగు చుండును. చెలులు దేవి శవముచెంతఁగూర్చుండి యుందురు.)

(నేపథ్యమున సందడి)

1 దాసి—ఓసీ! అర్ధరాత్రిమున నీసందడియేమి?

2 దాసి—తొత్తుంగూతురు గంగవచ్చి చూచిపోయినదిక దా? దానివలన నెఱింగి చండికాపి శాచి వచ్చుచున్న దేమో?

1 దాసి—(పక్కకుఁజూచి) అదిగో! నాభూతమే! అయిన నింతవఱకుఁ బ్రియాత్న ముతోఁ బట్టియాఁపికొని యున్నశోకముఁ భారంభింతము. హా! తల్లీ! తల్లీ!

2 దాసి. హా! తల్లీ! తల్లీ!

[ప్రవేశము పరివారముతోఁ జండిక)

చండి—ఓసీ! యేమే! ఏడ్చుచుంటిర్థి?

1 దాసి—అమ్మా! అమ్మగారిప్పుడే ప్రాణమువిడిచిరి.

చండి—హా! అక్కా! అక్కా! [మిూఁదఁబడి కపటదుఃఖము నటించును]

1 దాసి— [అపవారించి] ఓసీ! చూచితివే? మనకన్నఁ బెద్దగ నేడుచ్చుచున్నది. మొగమున గొంగుఁగప్పుకొని యేడ్చుచున్నది. కన్నీరు గాఱదుగనుక గనంబడకుండ నీతంత్రము.

2 దాసి — (అపవారించి] ఓసీ! అట్లు గాదే! మొగమునఁ గొంగుఁగప్పుకొనుట కన్నులకుమ్మి రాచుకొని కనఁజేయుటకే! మాయలమారిము ండ!—జగజంతి!

చండి—ఓసీ! భర్తృదారకుఁడు కుమార విజయేంద్రుఁడెక్కడ?

దాసీ—అమ్మా! అప్పటినుండియు నమ్మాయమ్మాయని తల్లి శయ్యచుట్టు దిరుగుచు నేడ్చుచుండెను. ఇప్పుడెటుపోయెనో?

చండి—ఎటుపోయెను? ఎగిరిపోయెనా?

దాసి—అమ్మా! మేముచూడలేదు. ఎగిరిపోయెనో? నడిచిపోయెనో? మే మేమెఱుంగుదుము?

చండి—ఆ! చతురవచోరచనలు చండికదండనా! జాగ్రత! మీ ప్రాణములు దక్కవు! దాచవకుడు.

దాసి—మేమెఱుఁగము.

చండి—సేవకులారా! ఈదురాత్ముల బంధించి కారనిడగొనిపొండు

(కొందఱు సేవకులువారిని బంధించుకొని పోవుదురు)

చండి — [ఆత్మగతము] మంత్రి వచ్చిపోయినట్లు వానితో భార్యయు నిరువురు చిన్నపిల్లవాండ్రు నున్నట్లుమంత్రి యనుగారవముంచి రెండవబాలునిగూర్చి ద్వారరక్షకు లడుగమియుఁ దెలియవచ్చెఁగదా? వానిపనియే యిది. ఎక్కడకుఁ బోవునో చూతము [నిష్క్రమించు చున్నది] [యవనికపడును]





# చండిక

## చతుర్థాంకము

### ప్రథమరంగము.

(ప్రదేశము. పురము వెలుపలి ప్రదేశము.)

(ప్రవేశము. ధీరమల్లుఁడు. వీరపత్ని. విజయేంద్ర మల్లుఁడు. రాజేంద్ర మల్లుఁడు రామమల్లుఁడు లక్ష్మణమల్లుఁడు)

ధీర—ప్రాణేశ్వరీ! బండ్లును గుఱ్ఱములును నవిగో సిద్ధముగ నున్నవి. వీనిపై నేగిన జాడలఁబట్టికొని ప్రతిపక్షులు వెంటాడుదురు. మన కష్టమప్పుడు వృథాయగును. కష్టమనక నీవును నీరామమల్లుఁడును జెతి యొక పిల్లవానినెత్తికొని యాబీడునఁబడి పదిమైళ్ళు నడచిపోయిన లక్ష్మణపురిఁ జేరుదురు. అందునీకు నొసంగిన ధనముతో రెండుగుఱ్ఱము లఁగొని వానిపై నెక్కి పిల్లవాండ్ర నెక్కించుకొని యడ్డత్రోవంబడి శ్రీనగరము నకురండు. నేనును లక్ష్మణ మల్లుఁడును శకటములతోడను వారువములతోడను బయలువెడలి యీమార్గమున శ్రీనగరమునకు వత్తుము. బండ్లజాడలఁ బట్టియు గుఱ్ఱపుడెక్కల గుఱుతులఁబట్టియు, శత్రువులుమమ్ము వెంటాడుదురుగాని మిమ్ము వెంటాడరు. తప్పించుకొని వచ్చితిమా! శ్రీనగరమున మిమ్ముఁగలసికొందుము. శత్రువుల బారింబడితిమా! చింతయేల? చావెల్లరకు నున్నది.

గీ. సకియ! మరణంబులన్నింట సమధికంబు
పోరునందలి మరణంబు పూరుషునకు
అందు మాతృదేశము కొఱకధిపుకొఱకు
నీయసుపులఁ ద్యజియించు టెంతే ఘనమ్ము.

మఱియు.

ఆ॥ వె॥ పందయైనవాఁడు ప్రాణభీతిం జేసి
ప్రత్యహమ్ము నచ్చుఁ బద్మగంధి!
వీరుఁడైనవాఁడు వెఱువమి నొడలికై
యొక్కమాఱె చచ్చు నుత్పలాక్షి.

కావున నాకొఱకుఁ జింతింపవలదు. ఇంక మన ప్రభుకుమారుని మన పురగిరిరాజవంశాంకురమును రక్షించుకొనవచ్చుభారము నీపైఁబెట్టితిని.

వీర—ప్రాణనాథా! మీ సేవకురాలు మీ యాజ్ఞను శిరసఁ గుచ్ఛమునుఁబోలె శిరమునఁ దాల్పవలదా ? మీ కీసందేహ మేమి? కష్టమనక యుంటిరి. ఇందు మాకుఁ గష్టమేమి ? ఇంతటి మహారాజ కుమారకునకు—ఇంతటి యాగర్భశ్రీమంతునకు - నింతటి కష్టము గలుగ మాకష్ట మేపాటిది?

ధీర—ప్రాణేశ్వరీ! విదుషీమణివి. వేయిమాటలు నీకుపదేశింపఁ బనిలేదు. అయిన విడిచిపోవుచుంటిఁ గాన నింతగాఁ జెప్పుచుంటిని నాకడవాక్యముల నాకర్ణింపుము.

ఆ. వె. ప్రభుని యుప్పుగుడిచి, ప్రభుని పులుసు ద్రావి,
మేను పెంచినార మేనెలంత!
మేను విడువనైన మాను విడువనైన
విడువరాదు ప్రభుని కొమరుఁగుఱ్ఱ

రామమల్లా! జాగ్రత సుమా! ఇంక బాలుర నెత్తికొనిపొండు.

వీర—రామా—చిత్తము (కుమారుల నెత్తికొనినిష్క్రమింతురు)

ధీర—(లక్ష్మణమల్లునితో మఱి[illegible] వంకకునిష్క్రమించును)

... ... ... ... ... ...

... ... ... ... ... ...

(ప్రవేశము—అశ్వము నధిరోహించి ఖడ్గముఁబూని చండిక సాయుధులై కొందఱు కాల్బంటులు. తుపాకులతోఁ గత్తులతో గొందఱాశ్వికులు. పరిక్కల. దివ్వెటీలతోఁ గొందఱు సేవకులు)

చండి—(అశ్వముదిగ్గ నాశ్వికులట్లు చేయుదురు) సేవకులారా! సైనికులారా! ఇదియేమనము పరిశీలింపఁదగిన స్థలము. కోటనుండి బయటికి వచ్చినవారు ముందుగనిటకే రావలయును. ఎటకుఁబోయిన నిటనుండియే పోవలయు. ఇది నాలుగు బాటలుగలియు ప్రదేశము. దివ్వెటీల బాగుగఁజూపుఁడు. (సేవకులట్లు చేయుదురు)

1 సైని—అమ్మా! ఇదిగో నీమార్గమున బండ్లు గుఱ్ఱములు బోయిన జాడలు గన్పట్టుచున్నవి.

చండి—అవును ఇవిగో శకటచక్రముల చారలు! ఇవిగోఁ జీలి యున్న వృషభముల గిట్టల గుఱుతులు! ఇవిగోఁ జీలని గుఱ్ఱపు గిట్టల జాడలు! వీరెల్ల నిటే పోయియుందురు. అయిన నమ్మరాదు ధీరమల్లుని సక్కజిత్తులవాఁడు వాఁడు. మనము నాలుగుపట్లుగాఁజీలి నలువంకల వెదకవలయు. ఈబీడున గుఱ్ఱములు పోవుటకు వీఁలుగాని యిఱుకు బాటలున్నవి. కాల్బంటిట్లుపొండు. అశ్వికులలోఁగొందఱావంకఁ గొంద ఱీవంకఁబొండు. కొందఱునావెంటరండు. సేవకులారా! దివిటీలతో మీరు నాలుగుపట్లతో నడువుడు!

(ధీరమల్లాదులేగిన వంకఁ జండికయుఁ గొందఱాశ్వికులు గొందఱు సేవకులు నిష్క్రమింతురు తక్కినవారు. దక్కినమార్గముల నిష్క్రమింతురు)

## ద్వితీయ రంగము

(ప్రదేశము అడవి. ప్రవేశము విజయేంద్రమల్లు నెత్తికొని వీరపత్ని, రాజేంద్రమల్లు నెత్తికొని రామమల్లుఁడు)

వీర—రామమల్లుఁడా! సందడి?

రామ—అమ్మా! ఏవంక సందడి?

వీర—అదెన విలోకింపుము. దివ్వటీల వెలుఁగు! ఆ వెలుఁగునఁ గొందఱు సాయుధులగు సైనికులు!

రామ—అమ్మా! నిజమే! శత్రువులు. కర్తవ్యము

వీర—[విజయేంద్రునిడించి] నాయనా! ఆపత్కాలము! నామాట కెదురాడ వలదు. వారితోఁబోరి మేము పడినట్లు నటించి తిరుగనిన్నుఁగలసికొందుము. నిన్నుఁజూచిగా వారు వదలరు. కావున దప్పని తలంపక యుండాఁక నాపొదల మఱుఁగున దాఁగియుండుము.

విజ—అమ్మా! నన్నుఁ బందగాఁ దలంచుచుంటివా! నాకు భయములేదు.

సీ. నిఖిలభూతములకు నియతమ్ముమరణమ్మ
ధాత్రివారి లేటికిఁ దప్పునమ్మ!
మన మేడకుంబోవ మరణమాడకునచ్చుఁ
దవనీడఁ దావీడఁ దరమఁటమ్మ!
అమరేంద్రునకు వేయి యుత్తులు మాత్రమ్మె
కాలునకుం గోటి కన్నులమ్మ!
పగవారలంజూచి పాఱెడు భంగి మా
యిలుఁ గాచు కుక్కకుం గలదఁటమ్మ!

ఆ. వె. రాచపుట్టువునకు రణమందు మృతికన్న
భాగ్యమేమి? యట్టి భాగ్యమొదవ
బెదరి పఱవనమ్మ సన్నిధి చేరఁగాఁ
జేరితమంచుఁ బాఱ జేలనమ్మ!

వీర—[ఆత్మగతము] ఓహో! పదియేడులుగడువని పాపని యుపదేశము లెంత వింతగనున్నవి. [ప్రకాశముగ] నాయనా! విజయేంద్రా!

సీ. ఎల్లరకున్న దే మృత్యువట్లని కాని
కాలమ్మున గతింపఁ బోలునయ్య?
క్షత్రియాన్వయునకు సంగరస్థలిఁజావు
చనునంచు మిన్న కే చత్తురయ్య?
రిపుని బర్హాణ మొనరింపక మ్రిందుట
రాచపుట్టునకు సార్థక్యమయ్య?
1 జీవాత్మచనుపైని జన్నమ్ము గొఱగాని
యీకట్టె చేయున దేమియయ్య?

ఆ. వె. చచ్చు మీఁద నెవరి సాధింపఁగలవయ్య?
యింత చేసిన జగజంత గొంతు
గోసి పైతృకమ్ము గొని తల్లిదండ్రుల
వైరమెట్లు దీర్చి వఱలెదయ్య?

తండ్రీ! విజయేంద్రా! నేఁదల్లిని గదా? తల్లిమాటదాఁటుదురా నిను బోఁటి బుద్ధిమంతులు? అదియుంగాక? నాయనా! నీవిప్పుడు దాఁగుటనిన్ను రక్షించుకొనుటకుఁగాదు. మమ్మురక్షించుటకు—పురగిరిరాజ్యప్రజల నందఱ రక్షించుటకు—పురగిరి సింహాసనము రక్షించుటకు—తడవగుచున్నది. మాటాడకుము.

విజ—అమ్మా! నీయాజ్ఞమీఱఁజాలక పోయెదను. కాని తా కేంద్రమల్లుఁడెందులకు?

1 ప్రాణమేఁగినపైని - పైనకుఁగొఱగాని

వీర—నాయనా! వాఁడు లేకున్న నిన్ను నతని నెందో దాఁచితిమని శత్రువు లనుమానమందెదరు. పసికూన వాని నెవ్వరేమందురు? వీఁడే మా వెంటనుండెననియు, రాజకుమారు నెఱుఁగమనియుఁ జెప్పి తప్పించు కొందుము. దగ్గఱకు వచ్చుచున్నారు శత్రువులు! నడువుము.

విజ—అమ్మా! ఏఁగెదను కాని యొకమాట మాత్రమువిశ్వసింపుఁడు?

అ. వె. కలనఁబడక నన్నుఁగలసికొందుర పరి
కాకయున్న నేన కలసికొందు
నన్నుఁ బట్టి మిమ్ము మన్నిఁ గొనిన శత్రు
కోటిఁగీటడంచి కూలితుదకు.

వీర—తండ్రి! అంతటి సాహసిక్యము వలదు సుమా!

విజ—ఏమి తల్లీ!

గీ. నాకొఱకుమీరు రెండుప్రాణము లొసంగ
నేను మీకొఱకీ రాదె ప్రాణమొకటి?
విభునకై ప్రజప్రాణమర్పింపఁ దగవె?
విభుఁడు ప్రజలకై ప్రాణమర్పింపఁదగదె?

వీర—నాయనా! నీకెందులకు? మేముగలసికొనకున్నఁగదా? త్వరితముగ బొదరిండ్ల మఱుఁగునకు నరుగుము.

విజ—కలసికొనకున్న నింతనిక్కము. (ప్రక్కకు నిష్క్రమిం చుచున్నాఁడు)

వీర—రామమల్లా! చూచితివా! ఈతండ్రికిప్పటికే ప్రజలన్న నింతప్రాణము. పెద్దవాఁడై మనయదృష్టవశమున రాజైనఁ బ్రజల కెంతసౌఖ్యమబ్బఁగలదో?

రామ—అమ్మా! పువ్వుఁబుట్టినతోడనే పరిమళ మబ్బును గదా?

వీర—తండ్రీ! రాజేంద్రమల్లా! నీతండ్రిగారు నిన్ను రాజకుమారుని వేషము వేయించుటకుఁ గారణము నీవుగ్రహించియే యుందువు.

రాజేం—అమ్మా! ఎఱుఁగుదును. వైరులువచ్చిన వారిని భ్రమింపఁజేసి రాజనందను రక్షించి నన్నోనంగుటకు. అందులకు నేను సిద్ధముగ నున్నాఁడను.

వీర—నాయనా! నాతండ్రీ! నీవీడునఁ జిన్నవయ్యు బుద్ధినిఁ బెద్దవాఁడవు. నీకుఁ జెప్పవలసినదేమి? అయిన నిదియే నేను నుడువుటకును నీవు నామాటల వినుటకుఁ గడసారి కావునఁ జెప్పుచుంటిని.

సీ. ఆకు మఱుఁగు కాయ నటుపెంచి నిన్నిప్డు
బలుమారి కర్పింప వలసెనన్న!
పూఁబొత్తులంచును బోదిపిన తల్లియే
కట్టెలనిడెనంచుఁ గనలకన్న!
నీపైని బగగాదు నీతల్లి దండ్రికి
బ్రభునుప్పుదిన్న విశ్వాసమన్న!
స్వామికార్యమునకుఁ బ్రాణమీఁ గొంకెడు
వారలే జీవచ్ఛవంబులన్న!

గీ. అమలరాజవంశాంకుర మవని నిలుప
నీవు నేడు ప్రాణంబుల నిత్తువేని
నీవ కాదన్నఁ గడుపార నిన్నుఁగన్న
నేముఁబితరులునుం దరియింతుమన్న.

హా! నాయనా! మముఁగన్నతండ్రీ!

శా. చేతోవీథిని జాలివీడి నినుమా చిన్నారి కన్నయ్య నీ
రీతిన్ రక్షసి నోటికిచ్చి యిటునంతృప్తిన్ వహింపంగ, మా
పాతిత్యంబును, మాదువ్రాతయును, మాప్రారబ్ధ మిట్లుండెరా
మాతండ్రీ! యిటుగాక రాకొమరునోమన్ మార్గమింకేదిగా!

కుమార ! రాజేంద్రమల్లా ! నిన్నుమాత్రమేగాదు తమప్రాణ
ములను తమసర్వస్వమును రాజవంశము కొఱకు ధారవోయుటకు
నీతల్లిదండ్రులు వెనుదీయరని విశ్వసింపుము. వేయిమాటలేల ?

గీ. ప్రభుకుమారుని రక్షింపఁ బ్రథమమందుఁ
గోరమా యున్న స్వర్గమ్ముఁ జేరనీవు
ప్రభుకుమారుని రక్షించు పనినిగూలి
ఏముగలసికొందమునిన్ను నింకమీద!

రాజేం—అమ్మా! నేనుమీకుమారుఁడఁగానా? నాకింత చెప్ప
వలయునా? వెఱ్ఱిబాగుల తల్లీ!

ఆ॥ వె ఎవనికూడుఁగుడిచి యెవనిగుడ్డంగట్టి.
యీశరీర మెదిగె నింతకింత
అట్టివాని కూర్మిపట్టికై యీమేను
నిచ్చుకన్న నర్హకృత్యమున్నె?

అదియునుంగాక.

గీ॥ నశ్వరంబైనయట్టి ప్రాణంబుదీని
శాశ్వతంబైనయట్టి యశంబుకొఱకు.
విడువఁజాలనె? నేనంతవెఱ్ఱినఁటవె?
తల్లి! పులికినిబుట్టునే పిల్లికూన?

వీర—నాయనా! శత్రువలు మఱింత సమీపమునకు వచ్చినారు. నీవువారితోఁ బెనఁగకుము! మేము పోరపడి పోయిన వెనుక నిన్న వారు బంధించుకొనిపోయి చండిక కప్పగింతురు-అదినిన్నుఁ జంపక విడువరు - ఏమిచేసిననరి. ధైర్యమువీడకుము. వీరడిగిన నేనే రాజ కుమారుఁడనని చెప్పుము. మఱవకుము

(నేపథ్యమున)

చోరులారా! నిలువుఁడు. పాఱినఫలములేదు

(కొఅవాలునొఅనుండి వెఱకి)

వీర— రాజద్రోహులారా! రండు, రండు—మీకొఱకే పిలిచియుంటిమి

(ప్రవేశము కొల్పంట్లు దివిటీలతో సేవకులు)

రామ—(కృపాణిఁదాల్చి సిద్ధముగనుండును)

1. సైని—ఏఁడి? రాజకుమారుఁడు—

వీర—ఓరీ! ఇతఁడే! మా ప్రాణములఁ గొన్నఁగాని రాకొమరుఁ గానిపోనియము-

1 సైని— ఓసీ! మంత్రిభార్యరా!

2 సైని—మంత్రియేఁడిరా!

3 సైని—వీఁడుమంత్రి పుత్త్రుఁడేమో!

రాజే—మూలిపంప్ల విఱుగఁదన్నదను. నీకుఁగన్నులున్నవా! చెవులున్నవా!

3 సైని—అయ్యా! క్షమింపుఁడు: నాకెలుఁగు బంటునకుఁబలె దృగ్బలమును, శ్రవణశక్తియుఁ దక్కువ

రాజే—అయినఁ బసిపట్టుశక్తి లేదా? మూర్ఖుఁడా!

1 సైని—పసిపట్టుశక్తి లేదు భల్లూకపుఁ బట్టును లేదు. కాని

కల్లుదాగ్రివుటలో మాత్రిమువీని కెలుఁగుబాటునకన్న నెక్కువ సత్తి యున్నది

2 సైని — ఓరీ! ఈయాకువులఁబట్టి యీయాయనయే రాజకుమారుఁడని నిశ్చయముగఁ జెప్పవచ్చును. పట్టుకొనుఁడు. [దగ్గఱకుఁబోఁబోవును]

వీర — దురాత్మా! దూరముగనుండుము. [కఱవాలు విసరును]

1 సైని — (పడిపోవును)

(తక్కిన సైనికులు వీరవత్నితో రామమల్లునితో యుద్ధము సేయుదురు-కొందఱుసైనికులు పడిపోదురు- గాయములుదగుల వీరపత్ని రామమల్లుఁడు చచ్చినట్లు పడిపోవుదురు. సైనికులు రాజేంద్రి మల్లునిఁ బట్టికొని బంధింతురు)

మఱియొక సైని — అమ్మయ్యో! రమణిగాదు. రాకాసి!

ఇంకొకఁడు — పేరునకుఁ దగినట్లున్నది. (అపవారించి) ఓరీ ఇదిచచ్చినమాట నిక్కమా!

మఱియొక సైని — (అపవారించి) ఏమో?చావ కే పడిపోయి దగ్గఱకుఁబోయిన దొంగటక్కుల యెలుఁగుంబోలి మీఁదఁబడునేమో మనకెందులకు ?

వేఱొకఁడు — ఓరీ ! మనపనిమైనదిగాదా? మనభాగ్యము నేఁడెంతపండెనో - పోదమునడువుఁడు — (రాజేంద్రిమల్లునితో సైనికులు సేవకులు నిష్క్రమింతురు)

... ... ... ... ... ...

... ... ... ... ... ...

వీర — (లేచి) రామమల్లా ! వైరులు వెడలిరి. లెమ్ము. లేవలేకుంటివా?

రామ — (లేచి) అమ్మా! నాకపాయకరములగు గాయములం

తగా దగులలేదు కాని యీబుజము మీఁది గాయముమాత్రము చేయి నెత్తనిచ్చుటలేదు మీకో-

వీర—తగులుఁగాక! విచారమెందులకు మనము కృతార్థుల మైతిమి. రాజకుమారుఁడెక్కడ?

విజ—(ప్రవేశించి) అమ్మా! వచ్చితిని. కానితల్లీ! రాజేంద్ర మల్లుఁడేఁడి?

వీర—నాయనా! వానిని వైరులు గొనిపోయిరి.

విజ—ఆ! ఎందులకు?

వీర—నీవని భ్రమించి-

విజ—అమ్మా! నాకుమారు వానినప్పగించితివా!

వీర—నాయనా! వానికివచ్చు నపాయమేమియు లేదు. ఒక వేళ వాని కారాగారమున నిడిననిడుదురు. పిమ్మటమనమే వదలింతము. విచారపడకుము. ఇటురా — తండ్రీ! ఇటురా! (దగ్గఱకురా నెత్తుకొని ముద్దులాడును)

రామ—అమ్మా! మీకపాయకరములగు గాయములు దగిలినవి—నే నీకుమారు నెత్తుకొని వత్తును.

వీర—అక్కఱలేదు. ముందునడువుము.

విజ—అమ్మా! నేను నడచివత్తును.

వీర—నాయనా! మార్గమున నన్నియు ముండ్లు నీవు నడువఁజాలవు. రామమల్లుఁడా! నడువుము. (ఆత్మగతము)

గీ. గడికొక యంకమ్ము బాయనికొడుకు నేల
పాలొనర్చిన నిర్భాగ్యురాలు లాఁతి
చిఱుతవారలఁజంక దాల్చిన, నొకింత
దాని పుత్త్రశోకము హెచ్చి తగ్గుఁగాదె?

రామ—అమ్మా! ఇటు ఇటు?

(నిష్క్రమింతురు)

తృతీయ రంగము

(ప్రదేశము, లక్ష్మణపుర సమీపారణ్యము)

(ప్రవేశము రామల్లుఁడు—విజయేంద్రుని నెత్తుకొని వీరపత్ని)

రామ—అమ్మా! లక్ష్మణపురిని సమీపించితిమి.

వీర—ఓహో! గుఱ్ఱపు డెక్కల చప్పుడి.

(నేపథ్యమున. భయపడకుఁడు)

వీర—ఓహో! ఈకంఠస్వరము హృదయేశ్వరునిది ఆర్య పుత్రుడిచ్చటి కెట్లువచ్చెనో!

రామ—అమ్మా! అశ్వముడిగ్గి యమాత్యుల వారరుగుదెంచు చున్నారు.

ధీర—(ప్రవేశించి) దేవీ! విజయేంద్రమల్లుఁడేఁడీ?

వీర—పుచ్చుకొనుఁడు

ధీర—(ఎత్తుకొని విజయేంద్రుని ముద్దులాడుచు) మనోహర రాజేంద్రమల్లుడేఁడి? అనుకొనినంత జరిగినదా!

వీర—ప్రాణనాథా! అట్లే జరిగినది. వానినొసంగక తప్పినది గాదు. (దుఃఖించును)

ధీర—తప్పినదిగాదా! కానిమ్ము దుఃఖమెందులకు? ఓబేలా! రాజవంశ సంరక్షణార్థము రక్తబిందువులఁ గార్పఁదగిన నీవు కన్నీళ్లు గార్చుచుంటివా?

గీ. ప్రభుని వంశమ్ము నిల్పిన భాగ్యమునకుఁ
గలికి! యానంద బాష్పముల్ గార్తు నేను
పట్టి గోల్పోయినట్టి దౌర్భాగ్యమునకుఁ
గొమ్మ! వేఁడి యశ్రువులను గురియుమీవు.

నెట్టిదానా ! శోకింపకుము.

గీ. ప్రసవకోమల! బాములు వడిన పైని
గాదె! కరుఁకు సత్కీర్తి గలుగ నేర్పు?
రవ్వ సానఁబట్టినఁగాదె రాణఁగాంచు?
పైఁడి పుటమువెట్టినఁగాదె ప్రభవహించు?

వీర—ప్రాణనాథా! నన్నుక్షమింపుఁడు. కడుపుఁదీపి నింతవిల పించితి. నాథా! మీరిట కెట్లు వచ్చితిరి?

ధీర—ధర్మపురివఱకుఁ గి లక్ష్మణమల్లామల శ్రీనగరమునకుఁ బొంతని చెప్పి పాదచారులై మీారరణ్యములఁ బోవుచుండన పాయ మేమైన సంభవించునేమో యను భయముచేత నందున్నయడ్డ త్రోవంబడి యిటు వచ్చితిని. ఇచ్చటనుండి శ్రీనగరమున కరుగు నడ్డబాట యంత యిఱుకుగానుండదు. అశ్వముతోఁ బోవచ్చును నేను రాజకుమారుని ముందిడుకొని తురంగము నెక్కి యీబాటం బోయెదను.లక్ష్మణపురిచూపుమేరదూరముననున్నది. మీారటకుం బోవు నరికిఁదెల్లవాఱును.వెంటనే రెండుగుఱ్ఱములు వెలకుంగొని వానినెక్కి నే నేఁగుమార్గముననే మీారునురండు. దగ్గఱయుని ధర్మపురి మార్గమునఁ బోకుఁడు. నేనేఁగు నీమార్గముఁ జాలమంది యెఱుఁగరు. కావుననిటు శ్రీనగరమునకువచ్చిన మీాకు శత్రుభయముండదు.

వీర—చిత్తము.

ధీర—మెలకువతో మెలంగుఁడు. నేనరిగెద - (విజయేంద్రు నితో నిష్క్రమించును)

వీర—రామమల్లుఁడా! నడువుము.

రామ—అమ్మా! తిరుగ గుఱ్ఱపుడెక్కల టకటకధ్వానములు!

వీర— వీరుశత్రువులు. ఆర్యపుత్త్రుని వెంటఁబడి వచ్చుచున్నారు! వీరి నెదుర్కొని మనము చచ్చిన సరికాని కొంతవఱ కాఁపవలయు

... ... ... ... ...

... ... ... ... ...

రామ—అమ్మా! అయిన మనమిందేల తడవు సేయవలయుఁ ఎదురేఁగి కత్తిపోటులతో వారిని సత్కరింతము

(నేపథ్యమున)

"మేమే ముందుగా మిమ్ము సత్కరింతుము. ఇదిగోఁ గాచికొండు,,

(తుపాకులు పేలును. రామమల్లుఁడు గుండు దగిలి చనిపోవును. వీరపత్ని గాయముఁదగిలి పడిపోవును)

నేపథ్యమున "అశ్వముల దిగుఁడు"

(ప్రవేశము. చండిక. కొందఱుభటులు. దివ్వెటీలతో సేవకులు)

చండి—అమంత్రియేఁడి? ఆదొంగయేఁడి. దివ్వెటీలనిటు గనంబఱుపుఁడు (సేవకులట్లు చేయుదురు) ఓహో! వీఁడమాత్యుని సేవకుఁడు రామమల్లుడు. వీఁడుగతించినాఁడు. ఓహో! ఓహో! ఈమె యమాత్య చంద్రుల ధర్మపత్ని, వీరపత్ని. ప్రాణములతోనున్నది! సేవకులారా! వీరపత్నిని బంధింపుఁడు. (అట్లు చేయుదురు) దొంగపెద్దయేఁడి? విజయేంద్రుఁడేఁడి? వీరపత్నీ! నీవెఱింగియుందువు వారెటు వోయిరి? మీరిరువు రెట్లువచ్చితిరి? గుఱ్ఱములెక్కడ?

వీర—చండికా, మేము కాలినడక నే వచ్చితిమి -విజయేంద్రుని నాకుమారుని యింతకుమున్నే నీకాల్బంటులు పట్టికొని పోయిరి నా నాథుఁడిటురాలేదు

చండి—విజయేంద్రుని నాకాల్బంట్లు పట్టుకొనిపోయిరా! నీనాథుఁడిటురాలేదా? లక్ష్మణమల్లాదుల బాధించి వాఁడిటువచ్చెనని తెలిసి

కొనియే మేమువచ్చితిమి నీవబద్ధమాడుచుంటివి - విజయేంద్రుని మాటయైన నిజమా! సమ్మె(జాల! విజయేంద్రుఁడు పట్టుపడిన వాఁడు పాటిపోవునా! అబద్ధము. నా కాల్చంట్లిటువచ్చిన మాటనిశ్చయము మే కాని మీరు ప్రాణములతోనుండ విజయేంద్రుఁ వానిఁ తప్పించి యుందురా! మోసగించిరో దాఁగితప్పికొనియో యుందురు. వాఁడుగుఱ్ఱముపై వచ్చినట్లు లక్ష్మణమల్లాదులు చెప్పిరి - దివిటీలఁజూపుఁడు [సేవకులట్లు చేయుదురు] ఇవిగో గుఱ్ఱముగిట్టల చిహ్నములు.భటులారా! మీలోఁ గొందఱు హయములనెక్కి యూజాడలం బట్టికొనిపోయి వానింబట్టి కొనిరండు. వారిప్పుడు దొరకిరా వెంటనే తెల్లవాఱకమున్నే పురగిరికి రండు - తెల్లవాఱినపిమ్మట దొరకిరా పొద్దుగ్రుంకినదాఁక నెందో యుండి యర్ధరాత్రమునఁ బురిఁ జేరుకొనుఁడు.విడిచిరావలదు. మీప్రాణములఁ దక్కవుపొండు. (కొందఱుభటులు దివ్విటీలుగొని నిష్క్రమింతురు) [తక్కినవారితో] దీనినొక హయముపై బంధింపుఁడు (యిరువురుభటులు వీరపత్నిని గొనిపోపుదురు) మనము దెల్లవాఱకమున్నే పురగిరిఁజేరవలయును జనులుచూచిన విచిత్రవార్తలఁ బుట్టింతురు. తురంగముల కడకునడువుఁడు

[అందఱు నిష్క్రమింతురు]

[యవనిక జాఱును]

(తురీయ రంగము)

(ప్రదేశము-శ్రీనగర సమీపారణ్యము.)

(ప్రవేశము-తడిసినవస్త్రములతో ధీరమల్లుఁడు విజయేంద్రుని
వీఁపునఁ బైబట్టతో బంధించుకొని)

ధీర—(ఆత్మగతము)

ఆ. వె. ఏటిదరిని శత్రుకోటి వెంటాడ, హా
యమునుండి నీట దుమికి, పట్టెఁ
గట్టి వీఁపుపైని, గట్టుఁ జేరితి నీఁది
యేటినుండి! కాలు నోటినుండి!

ఆ. వె. కాసులేని పేటి నాసించి దొంగిలి
యుందు నేమిలేమి నరసితొలఁగు
దొంగలటులు, పట్టి తురగమ్ముఁగని తెల్ల
వోయిపోవువారు దాయలింక.

(విజయేంద్రునిఁ గట్లు విప్పి డించి వస్త్రములఁ బిండి తన
వస్త్రముల బిండికొనుచు)

నాయనా! విజయేంద్రమల్లా! దెబ్బ యేమియుఁదగుల లేదు
గదా? నీకెంత యాయాసము గలిగెఁదండ్రీ!

విజ—అమాత్యవర్యా! నాకేమియుం దెబ్బదగుల లేదు కాని

గీ. వైరి నిచయమ్ము వెంటాడ వారువమున
నుండి నను వీఁపున బిగించి యుదకమునను
దుమికి నప్పుడు నీదు దేహమున కెంత
దెబ్బ దవిలెనో యందుఁ జింతింతు నేను

ధీర—నాయనా! నాకేమియు బాధగలుగలేదు కాని వీర పత్నియు గ్రామమల్లుఁడు నేమయిరో?

విజ—పగతురావంకనుండియే వచ్చిరి. వారుతప్పక చిక్కియుందురు.

ధీర—అవును

విజ—అయ్యయ్యో! ఇనుమును గూడిన యగ్గికి సమ్మెట పెట్టు దప్పదని నట్లీదుర్భాగ్యునిఁ గూడినందులకు మంత్రిచంద్రా! నీకెట్టి చెట్టగలిగె?

ధీర—తండ్రీ! చెట్టలకేమి?

గీ. భృత్యుఁడేఛత్రము, పతిధరించువాఁడు,
వానలెండలుఁ గష్టముల్, వాని జేనిఁ
బొందనీక సేవకుఁడు దాఁ బొందవలయు?
ఇంత లేకున్న విభుఁడేమి? భృత్యుఁడేమి?

నాయనా! నాకుఁగష్టములపైఁ గష్టములు గలుగుచున్నవని చింతించుచుంటివా! కలుగుగాక? కలఁతయేల?

సీ. నన్నుఁ గన్నయ్య, నాయన్న, నానిధి, నాదు
పుత్త్రుండు రూపఱి పోవుఁగాక!
ప్రాణంబు ప్రాణంబు పరమసాధ్వీరత్న
మర్థాంగి కాటికి నరుగుఁగాక!
నన్నుఁ దండ్రింబోలె మన్నించు సేవకు
లెల్లవారును నశియింత్రుగాక!
నాదు సంపదలెల్ల నాశమై తుదనాకు
బిచ్చ మెత్తుదుగతి వచ్చుఁగాక!

గీ. దిక్కుమాలి యీకట్టెయుఁ ద్రెళ్ళఁగాక!
ఏను జింతింప మదిలోన నించుకైన
అవని నిను నిల్పఁ బెట్టిన సతియచాలు
పట్టి! యదె పది వేలు నాపుట్టువునకు.

కుమారా! ఒకమాటఁ జెప్పెద సావధానమతివై వినుము.

గీ. పట్టియును భృత్యకోటియుఁ బ్రాణసఖియు
నున్నవారలే, యన్న నీవున్న నాకు!
పట్టియును భృత్యకోటియుఁ బ్రాణసఖియు
లేని వారలే నీవు లేవేని నాకు.

నాయనా! తెల్లవాఱవచ్చుచున్నది. అదిగో! శ్రీనగరము! చీఁకటి యుండఁగనే పోవుట మంచిది. ఏరైనఁజూచిన చండిక కెఱింగింతురేమో! ఎఱింగినను శ్రీనగరాధీశ్వరుని రక్షణమున నున్న నీకు భయము లేదుగాని మనమై మనమెఱుఁగఁ జేసికొననేల? ఇటురమ్ము.

విజ—నేను నడచి వత్తును.

ధీర—తండ్రీ! నడుతువా! వలదు?

గీ. సకల సామంత మస్తకస్థలులయందు
సమద రిపురాజవరకిరీటములయందుఁ
బరఁగఁజాలు నీపావన పాదయుగళ
మేల? నాయనా! యీకంటకాళి సోఁప?

వలదు విజయేంద్రా! ముందు—ఇటురా (ఎత్తికొని నిష్క్రమింతురు]

## పంచమ రంగము

### (ప్రదేశము చండికా మందిరము)

[ప్రవేశము చండిక]

చండి—[ఆత్మగతము] అశ్వికులు వట్టి గుఱ్ఱముం బట్టికొని వచ్చి నాయాశ నడియాసఁగావించిరి. వాఁడు హయమును డిగ్గి యెటు వోయి యుండును? భటు లాప్రాంతమున దెల్లవాఱువఱకు వెదకి వేసరితి మని చెప్పిరి. ఎందు దాఁగెనో? అట్లుగాదు ఈతఁడీతనుఘనుఁడని విందు. ఏటియొడ్డున నాశ్వికులు వెంటాడివచ్చుచుండ బాలుని వీఁపునఁ గట్టికొని నీటఁబడి యావలియొడ్డునఁ దేలియుండును. వాఁడంత వాఁడు. తేలుఁగాక! ఎటకైనఁ జేరవలదా? ఆసమీపమున నున్న పురము లెయ్యవి?—మల్లవరము దానినేలు సింహమల్లుఁడు గిరిరాజునకు గర్భశత్రువు. ఒకతూరి వానిపై దండెత్తి యీమంత్రియే యోడించి వాని కోశమంతయుఁ గొల్లగొనెను—అక్కడకుఁబోఁడు—రెండవది రాజనగరము—దాని కధీశ్వరుఁడు నా మేనమామ, అతఁడు నాశత్రువును మన్నించునా! కాన నటకునరుగఁడు—ఇఁక నున్నది శ్రీనగరము. ఆ! అక్కడకే పోయియుండును. తన్నగరాధిపతి గిరిరాజునకు బ్రియమిత్త్రుఁడు. మంత్రికిఁ జుట్టము ఇది నిశ్చయము. కానిమ్ము. ఉదయమున మూఁడు నగరముల బిచ్చగాండ్రవేసములతోఁబోయి వెదకిరండని వేగుల వాండ్రబంపితిఁగదా? వారువచ్చిన నిజమేమో తెలియఁగలదు. (కొంత తడవు మిన్నకుండి) ఔరా! వీరపత్ని యెంతటిది? బెబ్బులిపిల్లయని భ్రమింపఁజేసి పిల్లిపిల్ల నిచ్చినట్లు రాజకుమారుఁడని దనకుమారు నప్పగించి నాకాల్చంట్ల కంటఁగారము జల్లినది. ఏమిగుండెదానిది? బళీ! వీరపత్ని ధీరమల్లునకుఁ దగినపత్ని. వీఁడెంతవాఁడు! జేనెఁడులేఁడు.

తానే రాజకుమారుఁడనని తలఁచలేక వాఁడొనసట—ఆశ్చర్యమేమి ? మల్లెతీవ కల్లిపూవు పూఁదమునా ! సింగముకడుపునఁ జెవులపిల్లిపుట్టునా! వీరిరువురును సామాన్యులుగారు.

ఆ. వె. అబలయంచు దీని, నర్భకుండని వాని,
విడుతుమేని సిలుఁగు లడరు, నాఁడు
త్రాచు గఱవకున్నె ? తానెట్టితేల్ చిన్న
దైన మీటకున్నె యవని జనుల

ఆమంత్రి తంత్రములలో దిట్టరి. వీరింజంపక దాఁచియుంచిన నేదోయుక్తిని వీరిని దక్కించుకొని పోఁగలఁడు. అప్పుడు వాని యుత్సాహమధిక మగును. ఆయుత్సాహమున వానికార్యోత్సాహమును మడించును. అంతవఱకు మించకుండఁ జేయుటకు నీపనిమంచిది—భార్యాపుత్త్రుల మరణమున వానికి దిగులు పుట్టి యేమార్గమును దోఁప నీకుండును ఇట్లు గావించుట యన్ని విధముల మాకు శ్రేయస్కరము. ముందువీని బెదరించి మంత్రియునికిఁ దెలుపునుగేమో చూడ వలయు—(ప్రకాశముగా) ఎవరురా ?

(నలువంకల భటులు పరుగెత్తుకొని వత్తురు)

చండి—వీరపత్నిని రాజేంద్రమల్లునిఁ గొనిరండు ?

భటులు—చిత్తము (నిష్క్రమింతురు)

చండి—గంగా ! గంగా !

గంగ—(ప్రవేశించి) అమ్మా ! ఏమి సెలవు ?

చండి—రాజెట్లున్నాఁడు?

గంగ—మద్యప్రభావమున, మతిలేక, శవములాగున శయ్య పైఁ బడియున్నాఁడు.

చండి—మంచిది - దారిపున నీవుండి స్మృతివచ్చినప్పుడెల్ల మధు పాత్రము చేతికిచ్చుచుండుము - ఏమఱకుము—పొమ్ము -

గంగ—చిత్తము (నిష్క్రమించును)

ప్రవేశము భటులు. సంకెలలు వేయఁబడిన చేతులతో వీరసత్తి రాజేంద్రమల్లుఁడు)

1 భటు—ఓ మొద్దులారా ! మీకుఁగన్నులున్నవా ! దేవి గనఁబడుట లేదా ? మ్రొక్కరేమి ?

2 భటు—మా మాటలు వినఁబడుట లేదా ?

వీర—నాయనలార! మ్రొక్కరేమని మమ్ము మందలించుచుంటిరా? పురగిరి క్షత్రియవంశభూషణులు పురుషగ్రామణులు మీరు మ్రొక్కుచుంటిరి చాలదా?

చం. మొలలను ద్రిప్పగట్టితిరి, మూతులఁ బెంచితి రింతలేసి మీ
సలఁ, గమ్యఁగత్తిఁబట్టితిరి శౌర్యధనుల్ బలె, నట్టిమీరు భూ
స్థలిఁదలలంట మ్రొక్కినను జాలదెనిత్యము?,మంచిచెడ్డలన్
దెలియని బేలయున్ నిసుఁగు దేవికి మ్రొక్కక యున్న నేమిఁక న్?

రాజేం---మూర్ఖులార! నన్ను మ్రొక్కమను చుంటిరా!

సీ. సృజియింపఁ బెంప హరింపంగఁ గర్తయౌ
వారునకు మ్రొక్కుదు నట్టిచేయిఁ,
బురగిరి క్షత్రియ వరవంశ దేవత
కంబికకున్ మ్రొక్కునట్టి వాణిఁ
దినఁగూడుఁ గట్ట బట్ట నొసంగిరక్షించు
నధిపునకున్ మ్రొక్కునట్టి కేలుఁ,
గాంచి గారామారఁ బెంచెడు నమ్మకు
నయ్యకు మ్రొక్కెడు నట్టికరము.

గీ—ఎత్తి, నాదగు కత్తుకం గత్తిఁ బెట్టి,
వీరు: పశువునుంబోలె నన్నూభిమిఁ బండఁబెట్టి,
ముదముమీఱఁ గోఱగోఱఁ గోసెదరుగాక
మ్రొక్క నీముండకే నొక్కముండ నొక్క?

భటు—(ఆత్మగతము) అదిబల్లెపుఁబోటు! ఇదితుపాకి వ్రేటు!

చండి—వీరపత్నీ! రాణేఁదగ్రిమల్లా!అమూఢు లందురుగాక! నేను మిమ్ము మ్రొక్కఁ డంటినా? గడసుమాట లెందులకు' నాకు మ్రొక్కుటకు నేనేమిచండికా దేవినా!

వీర—అమ్మా! చండికాదేవివి గాకేమి? కాని, యీచండిక యమృతలతిక! ఈచండిక విషవల్లి! ఆచండిక కులదేవత! ఈచండిక మృత్యుదేవత!

చండి—శత్రువులకు!

వీర—కాదమ్మా! లోకమునకు!

చండి—మూఢలోకమునకు

వీర—లోకులందఱు మూఢులా?

చండి—నిక్క మెఱుఁగువారు దక్కవయుని నాయభిప్రాయము? ఏమన?

ఆ॥ వె॥ ధరణిఁ దిరుగుచున్నఁ దిరుగు ననరుజనుల్.
దిరుగకున్న సూర్యుఁ దిరుగునండ్రు
తప్పగలుగువారిఁ దెప్పరులోకులు
దప్పలేనివారిఁ దెప్పచుండ్రు!

నాయుద్యమము నింద్యమైన భర్తృపదభక్తి పరమనింద్యము! నాప్రయత్నము పతితమైనఁ బతిహితమే పతిహితమను మహానీయుల వాక్యము మహాపాప భాజనము!

వీర—చండికా! ధర్మ్ప్రశ్రేయమునకే యీభగీరధ ప్రయత్న మైననసుంగాక! మానమమ్మకొని మగనికి మహాభాగ్యము లుసంపాదించి యిప్పట సాధ్వీధర్మమా!

చండి—మానమమ్మకొనుట యేమి? వీరపత్నీ! వీరపత్నీ! కలివ శ్రీమల్లగోత్రసంభవ, చండికాభగవత్యంశసంభూత, చండకరాన్వ యాంబునిధిచంద్రిక, ప్రచండవీర కేసరి ప్రాణకాంత, మానవతీశిరో రత్నము మానమమ్మకొనియెనన్నమాట నీవును విశ్వసించితివా? .నాచండికావ్రతము, నావ్రతనియమములు నీవువినలేదా? వానింబట్టి యైన గ్రహింపవా!

వీర—గ్రహించితిని - నాయభిప్రాయమునీవు కులటవనికాదు. కానియీయుపకీర్తిం బడనేల! ఈతిడిగుడ్డలం గొంతులుగోయు టేల ఈస్త్రీహత్యలేల? ఈశిశుహత్యలేల? ఈరాజద్రోహములేల? ఈపాప కృత్యము లేల?

చండి—భర్తకొఱకు - నాదైవముకొఱకు! నాప్రాణేశ్వరుని భూమీశ్వరునిం జేయుటకుం!

వీర—అదియేటిధర్మము? రాజ్యార్హుండగ్రజుండు? రాజ్యార్హత తమ్మునకెచ్చటిది?

చండి—అన్నపోయినం దమ్ముండే యగ్రజుండు - లేకేమి? ఇదిక్షత్రియధర్మము!

వీర—అయిన క్షత్రియజన్మ మెత్తినవారెల్ల రాజ్యముకొ ఱకుం బ్రయత్నింప వలసినదే?

చండి—సమర్థతయున్న

వీర—సమర్థతయున్న సంగరమొనర్చి సామ్రాజ్యము సముపా ర్జించి ప్రాణనాధుని సార్వభౌమునిం జేయలేకపోయితివా! ఈమాయ

లేమి? ఈతంత్రములేమి?

చండి—రక్తపాతము లేకుండ రాజ్యములు సంపాదించు తంత్రములు!

వీర—చేతగాక రక్తపాతముం జేయవైతివి! ఇందు నీభూతదయయేమి? అయిన నింతవఱకు నీవు గావించినదియుం జేయించినదియుం జేయింపనున్నదియుం జాలదా రక్తపాతము!

చండి—సాధ్యమగునంతవఱకని నాయభిప్రాయము! ఈమాత్రమైన లేకుండనని కాదు.

ఆ. వె. కత్తిఁబట్టకున్న నెత్తురోడ్చకున్న
ఘోరబాధలొందనేరకున్నఁ
బ్రాణిహింససేయఁ బాల్పడకున్నను
లభ్యమగునె రాజ్యలక్ష్మి, యఱక?

అంతకార్యమున కేమి? ఇంత కార్యమునకుఁ జేసేదు బుదుత, రక్షించు నీపాటికార్యమునకు మీరందఱర్ధరాత్రమున దొంగల గుంపులాగున దారిఁబట్టవలసివచ్చెఁగదా? తెని కొడుకని బొంకి మాయచేసి కన్నకడుపు నడవిఁ గలుపుకొన వలసివచ్చినదిగదా? బెబ్బులి కారింబడిన లేడియుంబోలె నాబారి నీవు పడవలసి వచ్చెంగదా? విశ్వాసపాత్రుల రామమల్ల లక్ష్మణమల్లాదులఁ గంగఁ గలుపుకోవలసి వచ్చినదిగదా? పిటికి కండలేని మొఱకుబంటు బ్రిమకు జీవుఁడా యని పాఱిపోవలసి వచ్చెఁగదా?

వీర—తుచ్ఛప్రాణముల కాసించి నాభర్త పాఱలేదు. రాజవంశాంకురమును రక్షించుటకు -

చండి— ఎందులకైన నేమి? ఇంద ఱిన్నియవస్థ లందవలసి వచ్చెఁగదా? అట్టిచో నింతటి ఘనకార్యము సాధించుటకు నిదియేపాటి

రక్తపాతము! ఇవియేపాటి మాత్రలు?

వీర—కారెమ్ము? మమ్మునిట కేల రప్పించితివి?

చండి—ఆమంత్రి రాజకుమారునింగొని యెటువోయెనో తెలిసికొనుటకు.

వీర—మేమేమి దివ్యజ్ఞులమా!

—జే—దివ్యదృష్టిఁగల యోగులమా!

చండి—వీరాగ్రణీ! నెఱింగియుందువు—రాజకుమారుని క్షించాటకెందో దాఁచి సీతమాకప్పగించియుందువు—మంత్రిపాటీవచ్చి మిమ్ముం గలసికొన నర్భకుని నతనికిచ్చియుందువు—అబద్ధమాడకుము'

వీర—అబద్ధమాడనేల? అంతయునిజమే!

చండి—ఎటువోయెను మంత్రి? ఇదియు నిజమెఱింగింపుము—

వీర—ఎఱింగింపకున్న నేమి?

చండి—ఇదిగో జూచితివా! నిశితకృపాణము'

వీర—ఇదిగో నశ్వరంబగు ప్రాణము! దీనిపై నాకాశ లేదు

చండి—నీ ప్రాణముపైని మాత్రముగాదు-నీకొడుకు ప్రాణముపైని గూడ నాస విడువవలయు?

వీర—ఇప్పుడు చెప్పనేల? అప్పుడే విడిచితిని

చండి—అడవిలోనా!

వీర—అడవిలోనగాదు—అంతఃపురముననే!

గీ—రాణిరావించి యంతఃపురమునయందు
నెప్పుడర్భకునిన్ మాకునప్పగించె
నపుడెవిడిచితి మాన మాయనుఁగుఁబట్టి
పైనిఁ బ్రాణమ్ముపైని సగవ్వ.

చండి——అహా! మృగములలోఁ బులియొకటి ప్రసవించినతరి కాఁకలికోర్వక తినసేమియు లభింపక తనపిల్లలఁ దానుజంపుకొని తిను నందురు - అదియు నబద్ధమని కొందఱందురు - నేడు మానవులలో నొకకాంత క్షుద్బాధంగాదు - అనవసరముగ - లాఁతిబిడ్డకొఱకు - దనకొడుకును దానుజంపుకొనుచున్నది! విచిత్రము!

వీర——అగుఁగాక! ఏమి? ఒరులబిడ్డని రక్షింప నాబిడ్డనడవిఁ గల్పుకొనుచుంటివి గాని నాకొఱకు లాఁతిబిడ్డలఁ బసికూనలఁ జంపఁ గదా?

ఉ॥ కొంచెపురాజ్య భోగముల కోసము దోసమటంచు డెందమం
దెంచక లాఁతి పాపలవధించుట పాపము;, లాఁతిబిడ్డ ర
క్షించెదుపొంకెఁ, బుణ్యమును జేకొనుపోఁకె, నిజాత్మజాతు వ
ర్జించిననేమి? యంబునిధిఁబెల్పను దోఁచిన నేమి? భామినీ!

చండి——వీరపత్నీ! కొంచెపు రాజ్యభోగముల కోస మాసించి లాఁతిపాపల వధించుట నీతిబాహ్యమని నీవు నన్నధిక్షేపించుచుంటివి! నేనీపురగిరిరాజ్య సింహాసనము నెక్కి బోరగిలఁబడుటకు నుద్దేశించి, యీపురగిరి రాజ్యాధికారముఁ గొనగోటఁదాల్చి గంతులు వేయుటకుఁ గాంక్షించి, యీపురగిరిరాజ్యప్రజలఁ గటాక్షవీక్షణమ్ములఁ గట్టువడఁ జేసి మిడిసిమిడిసిపడుటకు నడియాస వహించి, యీరాజ్యభోగముల రెండుచేతుల బిట్టుమని జుట్టుకొనుటకు నువ్విళులూరి, యింతకుఁ దెగింపలేదే? ఇట్టిపాపముల కొడిగట్టలేదే? ఇట్టి ఘాతుకకృత్యము లొనర్పుటలేదే? ఇందు నొకింతయు నాకొఱకు, నాశ్రేయముకొఱకు, నాపొట్ట నింపుకొనుకొఱకుఁగాదే?

సీ॥ మాయలఁ బడవైచి మైమఱవంజేసి
బావ వంచించిన పాపమునకు
మది వ్యథఁ గూర్చి మందుమాకులువెట్టి
యధిపుసతింగూల్చు నఘమునకును
మంత్రిమంత్రిపదమ్ము మాయించి కానని
కాంతలఁ ద్రిప్పించు కలుషమునకు
ఏయశుభంబు శుభంబు నెఱుఁగని ప్రభుపుత్త్రుఁ
గూల్పంప యత్నించు ఘోరమునకుఁ

గీ॥ గలిక! స్వార్థపరత్వమా కారణంబు?
ప్రాణనాయకపదపద్మ భక్తిగాక!
పసుల మాంసాశఁ జంపఁ బాపమ్ముగాని
పాపమే దేవిఁ దనియింప బలియొసంగ?

వీర—చండికా! ఇది మూఢభక్తి! దేవిం దనియింపవలయు నన్న నోరులేని పశువులనే బలియొసంగవలయుననియేమి? తనరక్త మర్పించి తరియింపఁగూడదా? ప్రాణేశ్వరుని బాగునకుఁ బరులగొంతులఁ గోయవలయుననియేమి? వేఱుమార్గములు లేవా? అంతకన్నఁ దన కుత్తుకఁ గొఱగొఱఁ గోసికొన్న శాశ్వతకీర్తియు స్వారాజ్యమును సమకూరునే?

చండి—వీరపత్నీ! నీ వేమనుకొనుచుంటివి!

ఆ॥ వె॥ పతిహితమ్ముకొఱకుఁ బరులగొంతుల నేమి?
కోసికొందునాదు గొంతునైన
భర్తృపాదభక్తిఁ బ్రాణమర్పించెడు
కన్నఁగామినులకు నున్నముక్తి?

వీర—చండికా! నీవుపరులగొంతులు గోసిగాని నీకుత్తుకఁ గోసి కొనికాని నీహృదయేశ్వరునిఁ బృథివీశ్వరునిఁ జేయఁజాలవు! ఏమన? నీయత్నము మృత్యుయత్నము! నీయాశదురాశ! నీచేయుకార్యము ధర్మ బాహ్యము! సత్కార్యంబునకు జయంబును, దుష్కార్యంబున కపజయం బును గ్రీనీడలు!

చండి—వీరపత్నీ! నాకార్యము దుష్కార్యమని నీతలంపు. సత్కా ర్యమేయని నాతలంపు-ఎవరి యభిప్రాయము వారిది-నిర్ణయించుటకు నాతరముగాదు నన్నొప్పించుటకు నీతరముగాదు - మనకిందు వాదము లతోఁబనిలేదు. నేనిప్పుడు మిమ్ముఁజచ్చుటకు రావించుట మీవలననీతులు నేర్చికొనవలయునని కాదు

రాజేం—కాదమ్మా! మాకు నీతులు నేర్పి రాకొమరు నునికిఁ దెలిసికొని యాకొంచెముపనిఁ దీర్చుకొనుటకు.

చండి—మీారు చెప్పకున్నను నెఱవేఱకపోదు.

వీర—అయిననెందులకీ శ్రమము!

చండి—నాకెక్కువ శ్రమములేకుండఁ బోవును - మీాకుఁ బ్రాణములు దక్కును.

వీర—ప్రాణములపై మాకాస యణుమాత్రము లేదని పలు మఱుఁజెప్పికొను టనావశ్యకము!

చండి—అగు ననావశ్యకమే -మిమ్ము మాటిమాటికిఁ బ్రశ్నిం చుట మాకనావశ్యకమే! స్త్రీయనిశిశువని మీాయెడ మేము జాలిఁబూని మిన్నకుండుటయు ననావశ్యకమే! ఇంతవఱకుఁ బధులనటుభూమిపైఁ బండఁబెట్టి మీాగొంతులు గొఱగొఱఁ గోయింపకుండుటయు ననావశ్య కమే! సేవకులార! సిద్ధముగనుండుఁడు!

రాజేం—(మందహాస మొనర్చుచు) అబ్బబ్బా! భయము! భయము!

గీ॥ పశువులంబోలె భూమిని బండఁబెట్టు
వారలంట! కత్తులఁబూను వారలంట!
కోరిమాకుత్తుకలఁ గోయు వారలంట!
వీరలెప్పటికిఁ మనువారలంట!

వీర—చండికా! మృగములఁదినువారు పక్షుల భక్షించువారు మీనముల భుజించువారు మానవులలోఁ బెక్కుమందియున్నారు! కాని మానవుల నారగించు మహనీయులమాత్రము మందబుద్ధి యగు నవ్విరించి యింతవఱకు సృజించియుండలేదు. నేఁడాలోటు దీర్చుకొనుటకుఁగాఁబోలు నిన్ను నీసేవకుల సృజించినాఁడు! కానిండు! మమ్ముల గోసికొని యారగింపుఁడు!

చండి—మిమ్ము మే మారగింపము.

వీర—అయినఁ గటికవాండ్రు పసులగొంతులుగోసి మాంస మమ్ముకొనునట్లు మమ్ముఁగోసి యమ్ముకొందురా?

చండి— కాకులకు గ్రద్దలకు నక్కలకు వేయించెదము! తెలిసినదా?

వీర—ఆ! తెలిసినది. కాని నీవు తెలిసికోవలసిన సంగతి యొకటి యున్నది.

చండి—ఏదది?

వీర—వినుము.

ఉ॥ కాకులొ? నక్కలో? మఱియు గ్రద్దలొ? యేవియొమాదుమాంసముల్
మెక్కొనిమెక్కనిక్కముగ మాయెడఁ గూరిమిఁజేసి సాసి కా
నీకలవాణి! నీవు గతి యించెద వేని యు నీకుమాంసమున్
గాకులు గ్రద్దలున్ గడకు నక్కలుఁ గుక్కలు ముట్టఁబోవిలన్.

చండి—ముట్టక పోనిమ్ము. మీమాంసమే ముట్టనిమ్ము! తుది పారి! చెప్పెదరా? లేదా? మీకవసానము సమీపించుచున్నది-

రాజేం—మిమ్ములమాత్రము సమీపించుట లేదమ్మా!

ఆ॥ వె॥ ఎల్లవారిదరికి మృతి యుంతకంతకుఁ
 జేరవచ్చుఁ బోదు దూరమునకు
 మృత్యువిదిగో మిము సమీపించుటనులేమి
 మీదు దరికిరాదె మృత్యువమ్మ!

చండి—భటులారా! మీలో నిరువురు కృపాణములతో సిద్ధముగనుండుఁడు – (అట్లుచేయుదురు) వీరవల్లి! కడసారి వంశదేవతం జండికను స్మరించుకొనుఁడు– సెలవుఁ గైకొందురుగాని-

వీర—అందఱికడ సెలవుఁ గైకొందుము.

సీ॥ పురగిరిక్షత్త్రియ వరవంశదేవతా!
 యేఁగెదమిఁక సెలవిమ్ము దేవి!
మలహార! భవహార! మల్లవంశస్వామి!
 యేఁగెదమిఁక సెలవిమ్ము తండ్రి!
పాలుపార మముఁగన్న పురగిరీ! మాతల్లి!
 యేఁగెదమిఁక సెలవీఁగదమ్మ!
ప్రాణనాయక! నీదుపాదసేవంబాసి
 యేఁగెదమిఁక సెలవిమ్ము దేవ!

గీ॥ ధర్మమున్ నిల్పఁదలఁచిన తల్లిఁగొడుకు
మృత్యుదేవతా! కృపవీడిమ్రింగుచుంటి
వింతటనకైనఁ దృప్తివహించియెడఁద
నెనరుతో రాజవంశమ్ము నిల్పుమమ్మ!

చండి—రాజేంద్రమల్లా! నీవు–

రాజేం— నాకుమాఱు తల్లియే వేడికొనినది. బాలవాక్యము బ్రహ్మవాక్యమందురు కాన నేనిన్ను నాశీర్వదించి మరణింతును.

చండి—ఊ! కానీ!

రాజేం—విను.

సీ॥ నీయడియాసలు నీదుకుతంత్రముల్.
నెఱవేఱక వని రూపఱునుగాక!
పైమీఁదిబట్టయే పాము కఱచినట్లు
మగఁడె నీకుం బగయగునుగాక!
రత్నంపుగాజుల గాజిల్లునీచేతు
లిప్పసంకెళ్లచే నెసఁగుఁగాక!
నీవుభూపతిఁ జేయ భావించునీపతి
మతిలేకయతియయి మ్రిందుఁగాక
గీ॥ కడకు నీకుఁ బాడుపుఁజావు గలుగుఁగాక!
కపి యొవండొ నీకథ నాటక మ్మొనర్చి
చూడఁజేయ నీపాత్రమ్ము నరసి జనులు
చేరి ఛీ! ఛీ! యని యుమిసెదరు గాక!

చండి—భటులారా! కిక్కుఱుమనకుండఁ బొడిచివేయుఁడు.

భటు—(వీరపత్నినిరాజేంద్రు మల్లునిఁబొడుతురు.)

వీర— } మలహర! మలహర! (ప్రాణములు విడుతురు)
రాజేం— } (యవనిక జాఱును)

షష్ఠరంగము.

ప్రదేశము—అరణ్యము.

ప్రవేశము: వీరమల్లుఁడు.

వీర—(ఆత్మగతము)

క॥ సతియున్ సుతుఁడున్ భృత్యులు
గతియించినవార్త పడియెఁ గర్ణములందున్
క్షితిపతిగతి యేమయ్యెనొ?
మతివడఁకెడు వ్రతపుఁబూర్తి మాపటికగుటన్.

ఈవార్త నిజమైయుండునా? ఇంక నొకమాసము గడువున్న దని వినియుంటినే? ఇంతలో దీనికింత తొందర యేలకలిగె? రాజు తొందరపడుచుండుటచే నాపీడ వదలించుకొందమని యిట్లు సంకల్పించుకొనెనేమో? నిజమేకాకున్న నంతఃపురమున రహస్యముగ నాయాలుబిడ్డలఁ జంపినవార్తఁ దెలిసికొనిరాఁగలిగిన జాణలగు చారు లసత్యవార్తలఁ గొనివత్తురా? అయ్యో! ఉదయమున శ్రీనగరాధీశ్వరుఁడగు వీరమల్లునకు రాకొమరు నప్పగించిన వెంటనే బయలుదేఱి వత్తునన్న నాదౌర్భాగ్యముంబోలె వర్షమారంభమై నన్నడ్డగించె ఈబెట్టిదపు వార్తయు నప్పటికిఁ దెలియరాదయ్యె? తెలిసియున్న నీవర్షము నన్నడ్డగించియుండునా? దైవమా! ఇప్పుడేమి చేయవలయు? ఏఱుదాఁటుచోఁ బ్రవాహవేగమున నావాహనము గొట్టుకొనిపోకుండఁ దక్కుఁచుకొని యొడ్డునఁ బడితిఁగాని విధిచాలమి హయము సర్పముచేఁ గఱువఁబడి గతించె. పురగిరి యింక నిచ్చటకు నైదుక్రోశముల దూరముననున్నది ఇప్పటికే రేయి మొదటియామము గడచినది కాలినడక నీయంధకారమున నీముండ్లడొంకలలోఁబడి యెప్పటికిఁ బురగిరిఁ జేరువాఁడనో? అర్ధరాత్రియైన నాక్రూరకృత్యము నెఱవేఱును. అప్పుడు నాకష్టము

వ్యర్థము. రాజదత్కూట యుబద్ధము. కానిమ్ము! పులహారుఁడున్నా
డు. (పరిక్రమించును.)

(తుపాకి మోఁత, తుపాకిగుండు దవిలి ధీరమల్లుఁడు పడిపోవును.)

(భోజమల్లుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

భోజ—(ఆత్మగతము) అక్కటా! నే నేమిచేసితిని. పులియను
కొని నకునిఁ జంపితిని.

ధీర—(ఆత్మగతము) వీఁడు భోజమల్లుఁడు. చంద్రిక మన్నించు
భటులలో నొకఁడు. నేనని తెలియఁజేసినఁ జంద్రికకప్పగించును. ఏమి
చేయుదునో!

భోజ—(ఆత్మగతము) ఈవార్త యధికారుల కెఱింగిన ముప్పు
దప్పదు. వీని నిందే యుంచినఁ దెల్లవాఱినవెనుక నేరైనఁ జూతురు.
గుబురుగానున్న యీపొదలలోఁ బడవైచి పోయెద—

(ధీరమల్లు నీడ్చుకొని నిష్క్రమించుచున్నాఁడు.)

సప్తమరంగము.

ప్రదేశము - పురగిరి - అంతఃపురమునఁ బూజా

గృహము- ప్రవేశము- దేవింబూజించుచుఁ గూర్చుండి చంద్రిక
దాఁపుననిలిచి మద్యపాత్రముఁ జేఁబూని గిరిరాజు.)

గిరి—ప్రియుసి! చండికా సమారాధన మింకెంత సేపు? మన్మథ
సమారాధన మిం కెప్పుడు? పూజాగృహ నివాసమింక కెంత సేపు? శయ్యా
గృహప్రవేశ మిం కెప్పుడు? నీవ్రతము నెఱవేఱు టిం కెప్పుడు? నామనో
రథము సమకూరుటిం కెప్పుడు ?

చండి—దగ్గఱకు వచ్చుచున్నది ?

గిరి—ఏది? నీయధరము నాయధరమునకుఁ గనుదూరముగ నే
యున్నదే ? నాకరయుగమునకు నీస్తనయుగ్మ మింకనుదూరముగ నే
యున్నదే? నా కాయమునకు నీకాయమింకను దూరముగ నేయున్నదే!

దగ్గఱకుఁ జనవచ్చునఁటేది? వద్దిత్తు లేదు. ఈ మధుపాళి మొగ్గటిమాలిక్కు

నానాఁటికి దగ్గఱగానున్నది

చండి—(ఆత్మగతము) నా కరవాలము చేరువనే యున్నది! నీకు

మృత్యువు సమీపముననే యున్నది.

గిరి—మనోహారీ! దగ్గఱకుఁ దనంతఁదానే దిగును గాదేమో?

గీ॥ పూవుమధుపమ్ము చెంతకుఁ బోద రెపుడు.
పూవు చెంతకు మధుపమే పోవుఁగాని.
చేడె పురుషుని చెంతకుఁ జేరరాదు
చేడచెంతకు పురుషుఁడే చేరవలయు.

కావున నేనే చేరవచ్చెదను.

చండి—ఆఁగుము. తొందరపడకుము —

గిరి—

గీ॥ ఆఁగుమాఁగుమటంచు నన్నాఁపనేల?
చెంపపైఁగొట్టిబుద్ధిని జెప్పి యాపు
కొనఁగరాదె నామెడఁబట్టికొని తలంక
గొనక నీపైఁబడంగంటుఁ గొంచెమైనని?

చండి— (ఆత్మగతము) నీకే బుద్ధిఁ జెప్పెదను. నా కుత్సాహము పుట్టుచున్నది—ఈ పీడ వదలించుకొనుటయే మంచిది (ప్ర) రాజేంద్రా! వ్రతముపూర్తియైనది (శిరము విగ్రహము పాదముల సోఁకి నమస్కరించి) నీవునిట్లు నమస్కరింపుము.

గిరి—ఈ విగ్రహమునకు నమస్కరింపవలయునా? ఇస్సీ! ఏమంత ప్రారబ్ధము?

ఆ॥ వె॥ పసిడిబొమ్మవోలె నెసఁగుముద్దులగుమ్మ
　　మెదుటనుండఁగఁ గటా! యిట్టిరాతి
　　బొమ్మ కేలమ్రొక్కెదు? కొమ్మ! మద్యంబుండ
　　నేలనీళ్లఁ గొలఁకు నేద్యవలయు?

పోనిమ్ము! నీమాటమాత్రమేల దీసివేయవలయును?

(పడుచు లేచుచు మాటిమాటికి నమస్కరించు చుండును)

చండి—(బిలమునుండి కరతాలు వెలికి)

ఆ॥ వె॥ రక్తమందుఁబ్రీతి శక్తి! నీకెక్కువ!
　　యందు రాజరక్తమంటు సదికె
　　మర్పణంబొసఁగెత్తు నందికొ మాతల్లి!
　　శాంతులిమ్ము భక్తకల్పవల్లి!
　　　(గిరిరాజు శిరమునఱకుచున్నది)

(యవనిక జాఱును)



# చండిక

పంచమాంకము,

ప్రవేశము—మందిరము.

ప్రవేశము—చండిక.

చండి—(ఆత్మగతము) వేగులవాండ్ర వలన విజయేంద్రుమ ల్లుఁడు శ్రీనగరమున రాజరత్నణమున నున్నట్లు దెలిసెఁ గాని యతమా త్యునిఁగూర్చి తెలియ రాదయ్యె. దైవజ్ఞుల వలన నేమైనఁ దెలియు నేమో? వాఁడుకో దైవజ్ఞునిఁ దీసికొనివచ్చుటకు వాచేఁబంపఁబడిన విదూషకుఁడు అజడవారి యెవ్వఁడు?

(ప్రవేశము—సన్న్యాసి—విదూషకుఁడు)

చండి—(లేచినిలువఁబడును)

విదూ—అమ్మా! వీరుదైవజ్ఞులు, వీరుదేశయాత్ర గావించు చు నిన్న మనపట్టణమున కేతెంచి దేవాలయమున నుండి జనులకు జోస్యముఁ జెప్పి యనుగ్రహించుచున్నారు. వీరి కీర్తివిని బ్రతిమిలాడి యిటకు గొనివచ్చితిని.

చండి—ఆర్యా! వందనములు. ఈయాసన మధిష్ఠింపుఁడు.

సన్న్యా—అభీష్టము సమకూరుఁగాక? (కూర్చుండి) ఊరుదును విలోపీతమువఁ గూర్చుండుఁడు.

చండి—(అట్లుచేసి) నేను గొన్ని ప్రశ్నలడిగెదను.

సన్న్యా—ప్రశ్నలడుగకుండఁగనే ప్రత్యుత్తరముఁ జెప్పెదను.

చండి—(విదూషకునితో) నీవావలనుండుము.

విదూ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

చండి—సెలవిండు.

సన్న్యా—విజయేంద్రుఁడు శ్రీనగరాధీశ్వరుని రక్షణమున నున్నాఁడు. ధీరమల్లుఁడు లేఁడు.

చండి—ఎక్కడనున్నాఁడు.

సన్న్యా—చండికా సన్నిధ్యమున

చండి—గతించినాఁడా! ఎప్పుడు? ఎచ్చట.

సన్న్యా—నాల్గు దినముల క్రిందటఁజీఁకటిలోనతఁడు పురికి వచ్చుచుండెను—అప్పుడొక వేఁటకాఁడు పులియని మంత్రినిఁడు పాపితోఁ గాల్చివైచినాఁడు— వానిడీనగరమే—భోజమల్లుఁడను రాజభటుఁడు. చంపి నిజమెఱింగి మనుజుని జంపినవార్త నధికారులెఱింగిన దన్ను దండింతురని పొదలలోఁ గప్పిపెట్టి పాఱివచ్చినాఁడు. మీరు విచారించిచూడుఁడు.

చండి—సేవకా! (సేవకుఁడు వచ్చును.) నీవేఁగి భోజమల్లునిఁ గొనిరమ్ము—

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

చండి—ఆర్యా! ఆశవమేమయ్యెను?

సన్న్యా—క్రూరమృగముల పాలైనది. మృగములు దినుచుండఁ జూచినవారున్నారు. కానియీపురమున నొక్కఁడుమాత్రమున్నాఁడు వాఁడాశవము మంత్రిదేమోయని సందేహించుటయు సంభవించినది.

చండి—అతఁడెవ్వఁడు

సన్న్యా—ప్రతాపమల్లుఁడను నొక సేనాధిపతి. అతనిఁగూడ విచారించు కొనుఁడు.

చండి—సేవకా! (మఱియొక సేవకుఁడు ప్రవేశించును) నీవరిగి ప్రతాపమల్లుని గొనిరమ్ము

సేవ—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

చండి—ఆర్యా! రాజకుమారుఁడు నాకుఁజిక్కునా?

సన్న్యా—(ఆత్మగతము) ఈరక్కసి శ్రీనగరా ధీశ్వరుని పైకి జాడి వెడలి నిర్జించి రాకొమరుని జిక్కించుకొన యత్ని మొనర్చును గాఁబోలు? ఇదియుంతటి సాహసిక—శ్రీనగరాధీశ్వరుని గెల్చుట యసాధ్యమేగాని తూలదైవ మెట్లు చేయునో! దీనిఁబ్రోత్సాహింపరాదు. (ప్రకాశముగా) శ్రీనగరాధీశ్వరుని గెల్చుట యసాధ్యము:. మీామనో రథము నెఱవేఱదేమో!

చండి—చూచెదనుగాక.

సన్న్యా—చండికానుగ్రహమున్న నొకవేళ జయము సమకూరవచ్చును. రాజకుమారుఁడు చిక్కవచ్చును. కాని మీారొక పనిఁ జేయవలయును.

చండి—ఏదది?

సన్న్యా—రాజకుమారుఁడు చిక్కినఁజండికకు బలియొసఁగవలయును-ఈపురగిరి దేవ్యాలయమున అమావాస్యనాఁడర్ధరాత్రిమున - అట్లు చేసినఁ జండికకు మీాయందధికానుగ్రహము గలుగును.మీాకో-రికలన్నియు నేఱవేఱును. నాఁటికి నేను వత్తును ఎవిముగియావఱకు నీ సంగతి మన యిరువురకుఁదక్క నెవ్వరికిఁ దెలియఁగూడదు.

చండి—తప్పక యట్లు చేయుదును—

(ప్రవేశము భోజమల్లుఁడు సేవకుఁడు)

భోజ—అమ్మా! వందనము—

చండి—ఓయీా! నాలుగు దినములక్రిందట నీవు వేఁటకు బోయితివి.

భోజ—(భయముతో) ఆ - ఊ. హూఁ. లేదుతల్లీ! కాదు. పోయితిని తల్లీ!

చండి—ఎన్నిపులులఁ జంపితివి?

భోజ—చంపలేదు—కింటఁబడలేదు-

చండి—పులియసి నరునిఁ జంపితివా ?

భోజ—(భయముతో వణఁకుచు) అమ్మా! ఇదియసత్యము వా
నినన్నగిట్టనివారు కల్పించినది.

చండి—మూర్ఖుఁడా! అవణఁకేమి! నీవునరునిఁ జీఁకటిలో [illegible]
యని భ్రమించి తుపాకిం గాల్పలేదా! నిక్కమెఱింగి యుదరునఁ బొద
లలోఁగప్పిపెట్టలేదా? నిజము చెప్పుము - నిన్ను క్షమింతును

భోజ—అమ్మా! నిజమే - రక్షింపుము - (పాదములఁ బడ
బోవును)

చండి—(తొలఁగి) క్షమించితిని - పొమ్ము! ఇంకనైన మెలఁకు
వతో మెలంగుము.

భోజ—చిత్తముతల్లీ! బుద్ధివచ్చినది - చీఁకటిలో వేటాడను.
(చెంపలు వేసికొనును)

చండి—పొమ్ము.

భోజ—చిత్తము - [నిష్క్రమించును]

[ప్రవేశము, సేవకుఁడు. ప్రతాపమల్లుఁడు]

ప్రతాప—దేవిగారికిజయము.

చండి—సేనాధిపతీ! ఈపీఠమునఁ గూర్చుండుము.

ప్రతాప—[కూర్చుండును]

చండి—సేనాధిపతీ! లక్ష్మణపురినుండి యెప్పుడువచ్చితివి?

ప్రతాప—అమ్మా! మూఁడుదినములు నేటికి.

చండి—వార్త లేమి?

ప్రతాప—అమ్మా! లక్ష్మణపురిలో వార్త లేమి? 'పుట్టింటనున్న
నాభార్యం గొనివచ్చుటకుఁ బోయితిని. కాని మార్గమున నొక వింత-వీర
వ్రతమ్మా!

చండి—సందేహింపకుము. వారుమనకాప్తులు -

ప్రతాప—నేనెద్దులబండి గట్టించుకొని నాసఖితో వచ్చుచుం టిని - దారిలోఁ బులియొకటి యొకశవమును భక్షించుచుండెను - నేను దానిపైఁగాల్చి దానిఁజంపితిని - నిజము దేవుఁ డెఱుఁగునుగాని [illegible]చేతనో యాశవముఁ జూచినప్పుడునాకు ధైర్యముల్లో ... వారు జ్ఞప్తికివచ్చిరి -

చండీ—తలభక్షింపఁబడినదా!

ప్రతాపు—కొంత కొంత.

చండీ—మఱిశ్రీమతియను ననుమానము నీకెట్లుగలిగె?

ప్రతాపు— ఆపాదవు, నాలావు, నావిశాలవక్షస్థ్సలము, నాయాజాను బాహువులు నాకాలిగోళ్లతీరుజూడనాకట్టి సందేహము గలిగినది -

చండీ—అయిన నీవార్త మాకేల వెంటనే తెలియఁగింపవైతివి?

ప్రతా—అమ్మా! నాకు దారిలో నేజ్వరము పట్టుకొనినది- నేఁడు వదలినది- నేఁడు మీదర్శనమునకు వత్తుమని యుద్దేశించుచుం డఁగనే మీరంపినసేవకుఁడు వచ్చెను.

చండీ—మంచిది. నీవిఁకఁ బొమ్ము.

ప్రతా—చిత్తము. (నిష్క్రమించుచున్నాఁడు)

చండీ—మహానుభావా! మీవాక్యములన్నియు సత్యములు- మీరు దైవసములు. మిముంబోఁటి దేశయాత్రాపరిణుల నిందేయుం డుఁడని వేఁడికొనుట దగవుగాదు గాని మాయందనుగ్రహముంచి యు ప్పుడప్పుడు దర్శన మిప్పించుచుండఁ బ్రార్థించెద. మీకు వలసిన-

సన్న్యా—అమ్మా నాకేదియు వలదు-నాయుఁడు మీకుగారవ మున్న నేనిందనుకఁ జెప్పిన సంగతి మఱవకుఁడు-

చండి— దేవా! మీయాజ్ఞ జవదాఁటుదునా! అట్లే చేసెదను.

సన్న్యా— నేనింక నేఁగెద—

చండి— చిత్తము.

(సన్న్యాసి నిష్క్రమించును)

చండి— (ఆత్మగతము) ఔరా! ఎంతటి ప్రభావము. [illegible] దివ్యదృష్టి! కాని శ్రీనగరాధీశ్వరుని గెల్చుట యసాధ్యమనుచున్నాఁడు. మనోరథము నెఱవేఱదేమో యనుచున్నాఁడు! ఆ! ఏమి? చండికానుగ్రహమున్న జయము సమకూరునని [illegible]? చూతుఁగాక? ఆవిజయేంద్రుని మాయించినఁ గాని నాకు నిద్రరాదు.

ఆ॥ వె॥ మూఁతవసునె నేత్రములు? జిహ్వాకింపొనె
యేపదార్థమైన? నెట్టి వైభ
వములునైన మదికిఁ బ్రమదమ్ము గూర్చునే?
ప్రబలవైరి యొకఁడు బ్రదికియుండ!

అది గాక యావిజయేంద్రుని మట్టు వెట్టినఁ గాని నాప్రాణేశ్వరుని సింహపీఠి నెక్కించుటకు వీలులేదు. ఒక్కవేళ నెక్కించిన ముఖ్యోద్యోగులు దండనాయకులు సైనికులు నాపట్టు గావున జనులేమియుఁ జేయఁజాలరుగాని నాథున కెట్టి బుద్ధిపుట్టునో? తన యన్నకొడుకుండఁ దన కేలరాజ్యమని నాథుఁడు నామనోరథమును వ్యర్థము సేసినం జేయఁగలఁడు— కాన వాని మర్దించి గాని కారనుండి కాంతుని విడిపింపగాదు. అంతదనుక గిరిరాజు మరణవార్తయు వెల్లడింపగాదు. అతఁడు రోగశయ్యపై నుండెననియు, నతనికి మాఱు చండికయే రాజ్యకార్యములఁజక్కఁబెట్టుచుండుననియు, వ్యాపింపఁజేసి నవార్తలందనుకనటు లేయుండుఁగాక! ప్రధానదండనాయకునితో సంప్రదించి దాడికిఁ బ్రయత్నములు చేయించెద. (నిష్క్రమించుచున్నది.)

## ద్వితీయరంగము

ప్రదేశము. శ్రీనగర ప్రాంతారణ్యము,
ప్రవేశము. సన్న్యాసి

సన్న్యా—(ఆత్మగతము)

శ్రీనగరము ముట్టించిన చండిక కూపిరి దిశ గలుండ సామంతుల నెల్లఁ బ్రోత్సాహించి పోరొనర్పఁ బంపితిని. పురగిరి సేనల నీసామంతులు నిర్జింపలేరుగాని యిరుదెసల శత్రువుల నిర్జించి చండిక శ్రీనగరదుర్గము సాధించుటమాత్రమిఁక నసత్యము — కానియారాకాసి పట్టుదలయుఁ జాకచక్యమును నచ్చెరువు గలిగించుచున్నవి — ఏమాత్రమును వెనుదీయక పోరుసల్పుచున్నది? మఱియు నన్నన్న! దానిశౌర్య మెంతని కొనియాడవచ్చు! సత్యముగఁ జండిక చండిక, చండికసమదశాత్రవ ద్రుమకుఠారిక! ఎట్టిదైన నిప్పట్టున దీనికి జయము గగనకుసుమము. అట్లని యేకుటిలోపాయమున నైనఁ దనకార్యము సాధించుకొనునేమో? శ్రీనగరాధీశ్వరుఁడు దుర్గరక్షణమున మదినిల్పి రాజకుమార సంరక్షణమునఁ గొంతయైన నేమఱియుండును ఏవేళ కేమో? ఈవేషమునఁ బోయిన నన్నెవ్వ రడ్డగింపరుగాని శత్రువులచే ముట్టడింపఁబడిన కోటతలుపు లెట్లు తెఱతురు? చింతయేమి? ఈసమీపముననే కోటకుఁబోవుటకున్న గుప్తమార్గము శ్రీనగరాధీశ్వరునివలన మున్నెఁ దెలిసికొని యుంటినిగదా? ఆమార్గమునఁ బోయెదను [పరిక్రమించుచున్నాఁడు]

[నేపథ్యమున ఆర్యా]

సన్న్యా—ఓహో! ప్రతాపమల్లుఁడా! రమ్ము

ప్రతా—[ప్రవేశము] మీయాజ్ఞ నెఱవేర్పఁబడినది. మీరు చెప్పినట్లు మాగృహ మధ్యమునుండి దేవాలయమునకు విగ్రహము

పాతముల సమీపమునకు గుప్తమార్గము రహస్యముగఁ ద్రవ్వించితిని-మనము సులభముగ రాజాత్మజుని రక్షించుకొనవచ్చును.

సన్న్యా—ఎవరి కనుమానముగలుగకుండఁ బైబండ నెప్పటి వలె వేయించితివా!

ప్రితా—ఆ!

సన్న్యా—యుద్ధవార్తలఁ బట్టినసట్టి శ్రీసుముగలుగక పోవచ్చును - అయిన నెందునులోటు గలిగి చుకొవరాదు - మంచిపనిఁజేసితివి. ఒకమాట - నేనాయరణ్యమున నీబండింగలిసికొన సగౌరవముగనీవునన్ను బండి నెక్కించుకొని పురగిరిఁజేర్చిన వార్త బండివాఁ డెఱింగియుండెను. వాఁడాసంగతి నెఱింగింపకుండఁ జూచుచుండవలయును. మఱియుమనరహస్యము లేవియు నణుమాత్రమైన వెల్లడిగారాదు. మనమనోరథమంతయు భగ్నమగును.

ప్రితా—దేవా! నేనంత తెలివితక్కువ వాఁడనుగాను - బండివాఁడు విశ్వాసపాత్రుఁడు. మీకిందు సందేహమువలదు.

సన్న్యా—సరికాని యీయుద్ధమ్మున నీవురాలేదేమి?

ప్రితా—జ్వరము వచ్చుచున్నదను నెపంబున సెలవు గొంటిని

సన్న్యా— ప్రొద్దుగ్రుంకుచున్నది నేనుదిరుగఁ బురగిరిలో నిన్నుఁ గలసికొందును - ఇంక నీవేఁగుము.

ప్రితా—చిత్తము - [నిష్క్రమించు చున్నాఁడు]

సన్న్యా—[ఆత్మగతము] గుప్తమార్గమునఁ బోవుటకు దివ్వటీ యావశ్యకము. అయిన దివ్యాంజన మున్నదికదా! దానిఁగనులకుం బెట్టుకొనిన నంధకారమేమి! దివ్వటీకొఱకుఁ బ్రయత్నమేల? పేఁగెద.

(నిష్క్రమించుచున్నాఁడు.)

## తృతీయరంగము

ప్రదేశము - శ్రీనగరదుర్గమున కీవలిప్రదేశము. విజనస్థలము.

ప్రవేశము - చండిక - పురుషవేషముతో.

చండి—(ఆత్మగతము)

ఆ॥ వె॥ చెయ్వుపైని బెక్కు చెయ్వులు దోపఁడి
కట్టఁ ద్రెంచినట్లు గట్టి! రిపుమ
హీశ్వరునకుఁ బుమ హీశ్వరుల్ దోడ్పడి
నన్ను మిత్రుల నొంచు చున్నవారు!

ఈవంక సామంతులతో నెదుర్కొనుచు నావంకఁ గోటముట్టడిని వీరనగరాధీశ్వరుని సేనల నెదుర్కొనుచు నాసైన్యము విరిగిపోవుచున్నది. జయము గగనకుసుమముగాఁ గన్పట్టుచున్నది -

ఉ॥ బందుగులన్ సుహృజ్జనము బంటులభద్రగజవ్రజంబులన్
స్యందనబృందముం దురగసంచయమున్ దెగటార్చుకొంటనిం
దందును నెందు నేనియు జయంబొనఁగూడదు, చిక్కఁబోదు రా
ణ్ణందనుఁ, డేవిధంబున మనోవ్యథలాఱునో? కోర్కెదీఱునో?

దుర్గమరులచేఁ జిక్కినప్పుడు రాజబంధువులు దప్పించుకొనుటకు పంనేశవారులు వచ్చుటకుఁ బోవుటకునీకోటకు గుప్తమార్గము లుండకుండునా? ఉన్నఁబొదలచే గప్పఁబడియున్న యీప్రదేశమునఁ దప్పకయుండవలయును. అట్టిమార్గము నొకదానిం గనిపెట్టిన నెదోమాయసేసి విజయేంద్రునిఁ దప్పించుకొని రావచ్చునుగాని యెందు వెదకిన-ఏమది మనుజులసందడి?

[ప్రవేశము - ఇరువురుభటులు]

మొదటిభ —ఓరీ! ఇచ్చటనే. ఇదిగో! బండ.

రెండవ— లేవనెత్తుము -

మొదటి—[ఎత్తివేయును] రమ్ము - లోనఁబ్రవేశించి, మరల మూయుదము.

రెండవ—మెల్లఁగమూయఁగుము. శత్రువులువిన్నఁ జేటు -

చండిక—[ఆత్మగతము.] ఓహో! ఏమియదృష్టము! [కరవాలము నొఱనుండి పెఱికిమెల్లఁగఁ బరిక్రమించును]

మొదటి—ఓరీ! ముందుగనీవు లోనఁబ్రవేశింపుము.

రెండవ—[దిగనుద్యుక్తుఁడగును]

చండిక—[తలఁదెగవ్రేయును]

మొదటి—హా! తమ్ముఁడా! ఎవఁడవురా! [కత్తిఁబిసరును]

చండిక—[తప్పించుకొని] యమభటుఁడరా! [తల వ్రేయును] [ఆత్మగతము] ఓహో! ఏమియదృష్టము!

ఆ॥ వె॥ దేనికొఱకు నేను దేవులాడుచునుంటి
నదిదనంతలభ్యమయ్యెఁ గదర!
పండుకొఱకుఁ జెట్టుఁ బ్రాఁకయత్నించుచో
గాలిఁ గూలఁబడిన కరణిగాఁగ!

వీరువీరమల్లుని చేతనుండి సామంతులకడకు సందేశముగొని పోయిరిగాఁబోలు. పాపమతఁడు ప్రత్యుత్తరము కొఱకెదురు చూచుచుండును. వీరికడ జాబులేమైన నుండెనేమో! (వెదకిచూచి) లేవు - నోళ్ళుండఁగ వార్తలకు లేఖలెందులకు? ఇంక నా సేన కడకుంబోయి దివ్యాంజనమును జొక్కపొడియుఁ గొనివచ్చెద. ఈగుప్తద్వారము కడఁగొందఱు భటులఁగావలియుంచి యొకభటునిఁ దోడుదీసికొని లోనఁబ్రవేశించెద - మీఁదఁ జండికయే యున్నది.

(నిష్క్రమించుచున్నది)

## చతుర్థరంగము.

(ప్రదేశము - శ్రీనగరాధీశ్వరుని యంతఃపురమున నొక మందిరము.).

(ప్రవేశము-సెజ్జపై విజయేంద్ర మల్లుఁడు శయనించియుండును ఇరువురుభటులు ఖడ్గపాణులై కావలిగాయుచుందురు)

ఒకఁడు—ఓరీ! సామంతులకడకుఁ బోయిన సందేశహరు లింక రాలేదు

రెండవ—వచ్చుచుందురు - (ప్రక్కకుఁజూచి) బండగదలు చున్నది - ఎత్తుము

ఒకఁడు—నీవును దోడ్పడుము. (ఇరువురు బండఁదొలఁగింతురు. చండికయుభటుఁడును దటాలునఁబైకివచ్చి కుత్తుకలునొక్కి భటులఁజంపుదురు)

చండిక— ఇది యంతఃపురములోని మందిరము. (కిటికినుండి చూచి) ఓహో! బయటఁగొందఱు భటులు పండుకొనియున్నారు - ఒకఁడుఖడ్గపాణియై కావలిగాయుచున్నాఁడు - ఇచ్చటఁగావలియేల? (సెజ్జవంకఁజూచి) ఇందుశయనించిన వారెవ్వరు (పరిశీలించి - ఆత్మగతము) ఓహో! అదృష్టము.

కం॥ వెదకంబోయిన తీవయు
పదమునకుం దవిలినట్లు పట్టునడియెనీ
సదనమున నిసువుసంపద
యదిరా! విధివ్రాతయున్న నదెయొడిఁజేరున్

(విజయేంద్రునిపైఁ జొక్కుపొడిఁ జల్లి) భటుఁడా! వీని నెత్తికొని ముందుమార్గమునఁ బ్రవేశింపుము - మూఁతవైచి నేవత్తును-

(భటుఁడట్లు చేయును - చండిక లోనఁబ్రవేశించి బండజరిపి మూ[illegible])

... ... ... ... ...

(ప్రవేశము—సన్న్యాసి— వీరమల్లుఁడు భటులు కొందఱు సైనికులు

సన్న్యా—ఏమిది? వీరు చంపఁబడిరా?

వీర— (భయముతో) సెజ్జపై విజయేంద్రుఁడేఁడి? హా! హా! సర్వము భగ్నమైనది.

సన్న్యా—మనమువచ్చిగదా కాళము దీయించితిమి? ఎవరెట్లు వచ్చిరి? విజయేంద్రునెట్లు గొనిపోయిరి. వీరి నెవరు చంపిరి? ఇందేమైన గుప్తమార్గములున్నవా?

వీర—వారిద్దరు పడియున్న స్థలముననే యున్నది. సైనికులారా మీరామార్గమునఁ బోయి వెదకిరండు. (సైనికులునిష్క్ర)

సన్న్యా—ఆమార్గము శత్రువులకెట్లు తెలిసెను?

వీర—హా! ఈమార్గమున నేఁడిరువురు భటులు సామంతుల కడకంపఁబడిరి. వారుగాలేక వారిని నిర్బంధించి తెలిసికొని శత్రువులు వచ్చిరేమో! మూర్ఖులారా! ఈయిరువురు జంపుచుండ నందడి గాకయుండునా? శవములవలె నిద్రించుచుంటిరా?

భటు—(వణకుచు) అయ్యా! మేము మేల్కొనియే యుంటిమి—మాకేసందడియు వినఁబడలేదు.

సన్న్యా—శ్రీనగరాధీశ్వరా! గుప్తమార్గమున్న యీమందిరముననే విజయేంద్రునుంచవలయు ననియేమి? అంతఃపురములోని మందిరమని యుంతువుగాక వారి నీమార్గముననే పంపనేల?

వీర—ఆర్యా! సామంతుల సేనావారముకడకు నీమార్గమే దగ్గఱ—నాదౌర్భాగ్యమింతిచేసినది?

సన్న్యా—కానిమ్ము చింతిపడకుము—

వీర—ఆర్యా! చింతపడకు మనుచుంటిరా! ఇంక నేనేముఖముగ జీవింతును. నాదుర్విధి యెంతచేసె?

చ. కరినివహంబులన్ సుభట కాండములన్ రథసంచయంబులన్
హయులను సంగరస్థలిని సర్వణ సేసితి, వేయు స్వర్గం
పరలధరిత్రిఁ గార్చితిని, వారకయింతటి వంతలందియున్
హర హర! బాలు రక్షసికి నప్పనఁ జెప్పితి, మాటఁదప్పితిన్.

సన్న్యా—వీరమల్లా! గడచినదానికి వగవ నేమిఫలము? గా కొమరుని రక్షించుకొని వచ్చు భారమునాది. చండిక యుపసరము దీరినది గావున ముట్టడిఁజాలించి పురగిరికింబోవుము. మీకు వెఱ్ఱిచిన లాభములేదు. అమవసనాటికి సామంతులనందఱఁగలిసికొని నాఁడర్ధరాత్రిముగడచునటికిఁ బురగిరి దుర్గము ముట్టడింపుము- నాఁడే నిన్ను నేను నచ్చటగలిసికొందును. ఆయుద్ధము విజయేంద్రుని రక్షించుటకుఁగాదు- పురగిరి సింహాసన మెక్కించుటకు--నేవచ్చి కలసికొనువఱకు యుద్ధమారంభింపకుము-మఱవకుము.

వీర—చిత్తము-దేవా! విజయేంద్రుని జూడఁగలుగు భాగ్యము దీనికి నాకు లభించునా!

సన్న్యా—సింహాసన మెక్కించుభాగ్యముగూడ లభించును. చింతపడకుము, (అందరు నిష్క్రమింతురు)

## పంచమ రంగము

### ప్రదేశము దేవ్యాలయము

(ప్రవేశము బంధింపఁబడి దేవిముందుఁ బడియున్న విజయేంద్రమల్లుఁడు, ఖడ్గముఁదాల్చి చండిక. సాయుధులగు కొందరు భటులు సన్న్యాసి)

(దేవిసన్నిధిని దీపము వెలుఁగుచుండును)

చండి—దేవా! ఎందులకింక నాలస్యము?

సన్న్యా—ఏమియు లేదు. కాని అమ్మా! సింహాసనము మీకెక్కుదరా?

చండి—ఏల యిట్లడిగెదరు ?

సన్న్యా—వీని నెవరు నఱికెదరు ?

చండి—నేనుండ నొరులేల ?

సన్న్యా—సింహాసన మెవరెక్కెదరో వారు వీని వధింపవలసి యుండును.

చండి—నా ప్రాణనాథుఁడు నా కంఠమునైన ఖండించును గాని యీ బాలపాపకుత్తుకఁ గోయ నేరఁడు.

సన్న్యా—అట్టివాఁడిట్టి క్రౌర్యములచే నార్జింపఁబడిన సామ్రాజ్యము నెట్లు సమ్మతించును ?

చండి—సమ్మతించును—వీఁడు మరణించినఁ దానే రాజవంశమున మిగిలినవాఁడు-అట్టిచో నీసామ్రాజ్యమేమి చేయును. ఇతరుల కంటఁగట్టునా ?

సన్న్యా—(ఆత్మగతము) అట్టివాఁడైన నంగీకరింపఁడు. నిక్కముగఁ జండిక దేవురించుటయుఁ బ్రచండుఁడు తిరస్కరించుటయు సంభవించునేమో ? అదియే సత్యమైన రక్తపాతము లేకుండనే కార్యము గడముట్టును. నాఁడు న్యాయస్థానమున ప్రచండుఁడు గనంబఱచిన పశ్చాత్తాపముఁ జూడఁ బ్రచండుఁడట్టి వాఁడని తోఁచదు. కానిమ్ము మలహారుఁడున్నాఁడు.

చండి—దేవా ! ఏమి యాలోచించుచుంటిరి.

సన్న్యా—అమ్మా ! ఏమియు లేదు. సింహాసన మెవరెక్కెదరో-

చండి—ఏమి విఘ్నము గలుగునో ! నాకరవాలు ములగబెత్తమువలెఁ బుటుక్కున విఱుగునా ? వీనిశిరము తాఁబేటిచిప్పవలెఁ దెగకపోవునా ? చూతునుగాక.

సన్న్యా—అమ్మా ! అట్లేకానిండు కాని యొక విన్నపము-వీనివ

ధించువేళ మనమిరువురముదక్క నితరులుండఁ గూడదని నాఁకుఁ జెప్పి
చితిని-వీరందఱేల ?

చండి—ఎవరయిన శత్రువులడ్డగింతురేమో యని సాయము
గొని వచ్చితిని.

సన్న్యా—అయిన వీరు ద్వారము మూసి యవల నుందురు.
సందేహమా ?

చండి—ఏలసందేహము—పొండు ద్వారము మూసి యవల
నుండుఁడు

భటు—చిత్తము. (నిష్క్రమింతురు)

చండి—దేవా! ఏలయాలస్యము.

సన్న్యా—కానిండు

చండి—(కరవాలు నెత్తును.)

సన్న్యా—(చండిక మొగమున మచ్చుఁజల్లును)

చండి—(పడిపోవును)

సన్న్యా—(ఆత్మగతము) దురాత్మురాలా! ఇప్పుడు నీకెవ్వఁడు
దిక్కు ? (మొలనున్న ఖడ్గము పెఱికి)

సీ. కడుపునకన్నంబుఁ గట్టబట్టమొసంగి
నన్ను రక్షించిన నాదుస్వామి
నన్ను నన్నంబోలెఁ గన్నతండ్రింబోలెఁ
బరమకృపంజూచు పట్టమహిషి
ఘోరసర్పమునైనఁ గుసుమ గుచ్ఛమునటుల్
నాయాజ్ఞఁ దలదాల్చు నాలతాంగి
నాయంత్యవునయుండను నాకిన్ని [illegible]
ముక్తి నొసంగునా [illegible]

గీ. పరమహితులను నాభృత్యవరులఁ బొట్టఁ
బెట్టుకొనిన యీజగజంత బెట్టిదముగఁ
గలఁచుగత్తిని గండలు గండలుగను
గోసి యిడెద నక్కలకును గుక్కలకును.

(శాంతించి) ఇస్సీ! ఏమి చేయఁబోవుచుంటిని?

చం. పురగిరి భూపవంశమునఁ బుట్టితిఁ, గట్టితిఁ దార్ఢ్యాగిన్ మొలన్
గరమునఁబట్టితిన్ నిశిత ఖడ్గము, వైరిభట వ్రజంబు సం
గరమునఁ గూలఁగొట్టితిని, గట్ట మఱిట్టిఁడ నేను నేఁడిటన్
దగుణినొకర్తుకన్ మునుమ ధర్మమె? యింతమహోగ్ర కర్మమే?

ఈపిశాచిని బంధించుకొని పోయినఁ గత్తితో నవసరము లేకుండఁ గార్యము గడముట్టునుగాని పరపతి నంటుకొనుట యెట్లు? అది యుఁగాక మోసమున నిర్జించితినందురు. ఆయపకీర్తియేల? రాజపుత్త్రిని రక్షించుకొని పోయి పిమ్మట దీని దుర్మదమడంతుఁగాక-
(గుప్తమార్గముపైని బండఁదొలఁగించి రాజపుత్త్రి నెత్తుకొనిలోనఁ బ్రవేశించి బండ నెప్పటినూదికి జరపికొని నిష్క్రమించును)

(ప్రవేశము—భటులు-)

భటు—ఓరీ! రంగా! మోసము! మోసము!

(భటులుపరుగెత్తుకొనివత్తురు)

2వ భటు—ఏమిరా!

1వ భటు—ఏమున్నది? దేవిగారొక్కరే యున్నారు.

3వ భటు—నేఁ జెప్పలేదా? ఇంతతడవైనవారు రారైరేదో సంభవించినదని—

4వ భటు—వారెటుపోయిరిరా?

1వ భటు—ఇక్కడ నీబండ నందిచ్చియున్నదేమి? తొలఁగింపుడు

4వ భటు—ఓరీ ! ఇది గుప్తమార్గము. (ఎత్తివేయుదురు)

1వ భటు—అదిగో యిందులనే పోయియుందురు. కొందఱు పోయి వెదకి రండు—(కొందఱు భటులు గుప్తమార్గమునఁ బ్రవేశించి

(నిష్క్రమింతురు)

1వ భటు—ఓరీ ! దేవి మూర్ఛిల్లి యున్నది. నీళ్ళు దెండు !

(ఒకఁడు నిష్క్రమించి చెంబుతో నీరముఁ గొనివచ్చును.)

1వ భటు—(చండిక మోమున గొంచెము నీళ్ళుచల్లి) అమ్మా ! అమ్మా !

చండి—(స్మృతి గలుగ లేచి) ఓరీ ! మోసము అమాత్య యోగి యేఁడిరా ? విజయేంద్రుఁడేఁడిరా ?

1వ భటు—అమ్మా ! ఇదిగో ! గుప్తమార్గము ! మిమ్ము మత్తుచే మూర్ఛిల్లఁజేసి వాఁడు రాజకుమారునితో నిటే పోయియుండును. భటులఁ బంపితిమి ?

4వ భటు—ఇదేమి ? వీరిటు నుండి వచ్చుచున్నారు.

(భటులు ప్రవేశము పరుగెత్తుకొని)

భటులు—అమ్మా ! అపాయము

చండి—ఏమిరా !

భటులు—శ్రీనగరాధీశ్వరుఁడు కోటముట్టడించినాఁడు

చండి—ఆ! వాఁడెంతకు సాహసించె—మీరు పోయినపనిరా ?

ఒకఁడు—అమ్మా ! ఆగుప్తమార్గము దుర్గద్వారముకడ నగ నివాసమునన్నున్న శ్రీశాపతుల్లోని గృహములో నికున్నది—అగృహమున నెవ్వరు లేరు. దుర్గము కదలఁబోయి ద్వారరక్షకుల నమగఁ బ్రశాన్త సమల్లుఁడు మఱికొందఱు వశ్యముల నెక్కి యింతకుమున్నవలకుఁబో యిరని చెప్పిరి. మేము శౌరి వెంటఁబడుటకు సిద్ధపడుచుండ శ్రీనగరసైన్యము. కోట తలుపులు బిగింపఁబడినంతనే శత్రుసైన్యములువచ్చినవమ్మ

చండి—ముట్టడిఁ బ్రారంభించిరా!

మఱియొక భటు—లేదు కొంతదూరమున విడిసియున్నారు. ఎప్పుడారంభింతురో? మన ప్రధాన దండనాయకుఁడు సైన్యములతో దుర్గముఁ జేరి మీరాక కెదురు చూచుచున్నాఁడు.

చండి—గోరుచుట్టుపై రోఁకటిపోటు! ఈగుప్తమార్గము ప్రతాపమల్లుని గృహములోని దున్నదా! అహా! వాఁడే యీయోగిపై నాకెక్కువ విశ్వాసము గలిగించినాఁడు. ఈమాయల జడదారియే మంత్రియేమో? కానిమ్ము శత్రువులు చేయు మిగులువలకు సేనాధిపతిని తొందర పడవలదని చెప్పుడు నే నిప్పుడే వచ్చెదను. పొండు.

(అందఱు నిష్క్రమింతురు)

షష్ఠరంగము.

ప్రదేశము - ఒక సౌధము.

ప్రవేశము. చండిక. ప్రచండుఁడు.

ప్రచం—పాపాత్మురాలా! చండికా! చవితినాఁటి చందమామం బోలె నీమొగముఁజూచిన ఘోరపాతకమబ్బును - నాకేహ్యము పుట్టుచున్నది - నాయెదుటనుండి తొలంగుము.

చ॥ జాలినిదండ్రిభంగినను సాఁకినదాగ్రజుఁ, గన్నతల్లియుం
బోలెఁ గృపంగనుంగొనెడు భూపతిఁ వధియించి, పాపపుం
శ్రీలను రాజ్యలక్ష్మిఁదలఁ జేర్పఁగ వచ్చితెనాకు? నీవయీ
నేలను నెత్తిఁగట్టుకొని నింగికినెవ్వల వైచి యూఁగుమా!

ఛీ! దురాత్మికా! ఎన్నిహత్యలు గావించితివి? ఎన్ని మోసము లొనర్చితివి? ఎన్ని పాపములు గావించితివి? ఎక్కడికాంతవు? జగజంతివుగాక!

చండి—ప్రాణనాథా! నన్నింతదూషింతువా! నన్నింత యీసడింతువా! నాకష్టమునిట్లు వ్యర్థముగఁజేయింతువా! నామనోరథమునిట్లు

భగ్నమొనర్తువా! నేనేమిచేసితిని. మోసగించితిఁగాక! పాతివ్రత్యముఁ జెఱచుకొంటినా! నేనెందులకుఁ బాపాత్మురాలనైతిని - నామొగమేల చూడరాదు? నాయపరాధమేమి? ప్రాణనాథుని పారతంత్ర్యముఁ బరిత్యజింపించుటకు, కారాగారమునఁ జిక్కినకాంతునిఁ గాఁగిటఁజేర్చుకొనుటకు, కానిసేఁడుగానున్న పతినిభూపతినిఁ జేయుటకుఁ, బ్రయత్నించుట పాపప్రదమా! నీతిబాహ్యమా తగనికార్యమా! ఘోరకృత్యమా! ప్రాణనాథా! నీవుచెఱఁజిక్కిన నాఁటఁగోలె నన్నమొల్లక కందమూలాదులతోఁ గాలముగడిపి, యేభోగములనొల్లక యీశరీరమెట్లు కృశించినదో కనఁబడుటలేదా? నాథా నాహృదయము నాహృదయమేశ్వరున కెఱింగింపవలయునా? నిజమే! హత్యలపైహత్యలు దోసములపై దోసములు మోసములపై మోసములు, పాపములపైఁ బాపములు నేనొనర్చితిని! కానిహృదయవల్లభా! ఎందులకుఁజేసితిని! నాకొఱకా! నాపొట్టనింపుకొనితిరుగుటకా! ఈసిరులనెల్ల నాపుట్టిల్లుఁ జేర్చుకొనుటకా! ప్రభ్వినై ప్రకాశించుటకా! ఈపురగిరిరాజ్యసింహాసనముక్రిందఁ బడినలిగి చచ్చుటకా! ఎందులకు? నాథా! మొంగులకు?

ఉ॥ ఎన్నిమహోగ్రకృత్యముల నేనొనరించిన, నెన్నితంత్రముల్
వన్నిన, నెన్నిపాపములు వారకచేసిన, నెన్నిప్రాణముల్
మన్నొనరించినన్ సరియె, మద్ధితముందలపోసికాదు, వి
ద్వన్నుత! నాథ! తావకహితమ్మునకే నిజమింతనమ్ముమా!

ప్రచం—చండికా! నీపాతివ్రత్యమునకు నీపతిహితవర్తనకు నేనుసందేహింపను.

చండి—ప్రాణేశ్వరా! మీదాసి ధన్యురాలైనది.

ప్రచం—నీచేసిన దోసములు మోసములునాకొఱకే! కావునా దుష్కృత్యములకుఁగలుగఁబోవు నారకము, నేననుభవింతును. కానియీపా

పరపు రాజ్యము నే ననుభవింపఁజాలను! ఈ నెత్తుటికూడు నే భుజింపనోపను నేనీకిరీటము ధరింపఁజాలను,

ఆ॥ వె॥ అగ్రజన్మమాంస మక్కటా! నానోటి
కెట్లువోవు? నాల్క యెట్లుగ్రోలు
నగ్రజన్మరక్త మాఁదల నెటుదాల్తు?
నగ్రజన్ముపుత్త్రి నతివ నేను ?

చండి—అయిన నీపురగిరిరాజ్యము పరులపాలఁ బడవలసినదా! ఈకిరీట మొరులు దాల్పవలసినదా!

ప్రచం—ఒరులేల? భర్తృదారకుఁడు విజయేంద్ర మల్లుఁడు లేఁడా?

చండి—(ఆత్మగతము) వాఁడు బ్రదికి యున్నాఁడని యంగీకరించెనేమో? లేఁడని చూతును (ప్ర) వాఁడు మాత్ర మెక్కడనున్నాఁడు?

ప్రచం—ఏమి వానిగూడ మ్రింగితివా! పిశాచి! భూతమా!

చండి—నేను మ్రింగలేదు - మహామారి!

ప్రచం—ఆ మహామారి యీ మహామారియే! అయ్యో! అయ్యో

ఉ॥ ఎక్కడ దాపరించెనో కో? యీ ఘనభూతము పాడుఁబ్రేత మీ
రక్కసి, యంపెలాఁడి, కానురాగ, పిశాచి, గయాళిగంప, యీ
టక్కులమారి, మారి, చెడుఢాకిని, శాకిని, యుగ్రభంగి మా
చక్కని రాజవంశమును సర్వము నుర్వరఁ గల్పదైశమా !

ఓపూజ్యరాలా!

శా॥ నాయన్నన్ నను గన్నతల్లి వదినన్ నాకింత పిండంబిలన్
వేయుంజాలిన ముద్దులయ్య విజయున్ వేమున్న నీచేతితో
మాయం జేసితి యాశరమ్ము ననున్ మ్రందింపు పుణ్యాత్మురా
లా! యేలా? చిపుశేషముల్ విడువ?, యేలా? చేటు నేకూర్చెదే?

చండి—హా! హృదయేశ్వరా! నా యాశాలతిక సంతతంబు ముక్కలు ముక్కలుగ ఖండించుచున్నాఁడవు! నన్నే ఖండింపరాదా!

సీ॥ నానాథునిక్ భూమినాథునిఁ గావింపఁ
గొంతెమ్మకోర్కెలు గోరికోరి.
మోసముల్ గావించి దోసమ్ములొనరించి
పనిపడి తంత్రముల్, పన్నిపన్ని
ఆనల మెప్పించి బానలఁ గుప్పించి
కొఱగాని గొంతులు గోసికోసి
మందులఁ బెట్టించి మచ్చులఁ జల్లించి
చెన్నంటి చెయ్వులఁ జేసిచేసి.

గీ॥ కదనభూముల రక్తము గార్చికార్చి
రాజ్యమార్జించియుంచ విధివ్రాఁతఁ జేసి
కడకు ననిరాశఁ జచ్చె నీకట్టెయఘము
వెల్లఁబోవ నీవ వధింపవే హృదీశ!

(కాళ్లఁబడి) నాథా! ఖండింపుము - నన్ను ఖండింపుము -

ప్రచం—(తొలఁగినిలిచి) ఛీ! పాపాత్మురాలా! నిన్నుఁ జంపినం గూడఁ బాపము! అవలకుఁ బొమ్ము

చండి—ఏమి నాథా! నీయన్నను నీ వది నేను నీయన్న కొడుకును జంపినవారిని వధించి పగఁదీర్చుకొనరాదా!

ప్రచం—ఛీ! నీవేమిటిఁ బెట్టుకొని చావుము - నేనడవులకుఁ బోదును (పోఁబోవును)

చండి—ప్రాణేశ్వరా! వలదు - కొంచెము నిలువుము - (పాదములఁ బడఁబోవఁ బ్రచండుఁడు లిన్ని నిష్క్రమించును చండిక నేలంబడి మూర్ఛిల్లును)

... ... ... ... ...

చండి— (స్మృతిగలుగలేచి దిక్కులుపరికించుచు) హా! ప్రాణే శ్వరా! ప్రాణేశ్వరా!నన్నువిడిచిపోయితివా! ఈపాపాత్మురాలిని బరిత్య జించితివా! నాయందలిమోహముం బోనాడితివా! నాయాశలనెల్ల సడు గంటించితివా! నాయీపాడుశరీరమును మాత్రము మిగిల్చితివా! ప్రా ణనాథా! ప్రాణనాథా!

సీ. నీపారతంత్ర్యమ్ము నీక్షింపఁగా లేక
కలఁగుచుఁ గన్నీళ్ళు గార్చికార్చి
స్వాతంత్ర్యమిప్పింప సకల కష్టములంది
యడుగక చెమ్మట లూడ్చి యూడ్చి
సామ్రాజ్య మార్జింప సంగర స్థలికెక్కి
యొడలి క్రొన్నెత్తురు లోడ్చి యోడ్చి
ఫలము దక్కెనటంచుఁ బదవి చిక్కెనటంచు
నెఱిమోదబాష్పముల్ నించి నించి
గీ. కడకు నాయాశలన్నియుఁ గంగఁ గలియఁ
బ్రాణముల నోడ్పనుంటి నీపాదములను
ఇట్టులేని గృతార్థఁగా నీక యకట
త్రోచిపోయితె నాథ!యీదుష్టురాలి.

ప్రాణనాథా! పట్టపు దేవికి విషముఁ బెట్టుమని వైద్యునితోఁ బలికిన నాచెడునాల్క ఘోరాఘము దావకపాదక్షాళనోదకంబుఁ ద్రావి పాపుకొందు ననుకొంటి. భద్రకాళిక సాన్నిధ్యమున బావంబశు వునుంబోలె ఖండించిన నాపాపంపు హస్తము యుష్మద్వారవింద సంస్ప ర్శనంబునఁ బవిత్రమునర్చు కొందునను కొంటి. నాయొనర్చిన దోస ముల ఫలము, న చేసిన మోసముల ఫలము, నానల్పనహత్యలఫలము

నా సర్వాపరాధముల ఫలము, భవదీయచరణ సేవా సుకృతంబున నీ
గుడుచనుకొంటి. హా! హా! ఈయాసలాయాస లన్నియు నడియాస
లయ్యెనే? హా! దైవమా! ప్రాణేశ్వరున కింతయు నచ్చఁబోని యీ
పాపఁపు బుద్ధి నాకేలగలుగ వలయు? కలుగుఁగాక! ఇంతటి బెట్టిదంపు
గృత్యముల రవ్వంతయు వెనుదీయక నలువునంతటి సాహసిక్యము నా
కెందులకొదవ వలయు? ఒదవుఁగాక! అకలుషకార్యములఁ గావిం
చుచో నెవ్వరియునురోదగిలి యేవిఘ్నమో యొనఁగూడి నేనేలహో
రమ్మృత్యువు వాఁతంబడక మిగుల వలయు? మిగిలి జయముగంటిఁగాక!
నా హృదయేశ్వరుఁడేల నాయెడఁగనికరము వీడి నన్నుఁదిరస్కరింప
వలయు? తిరస్కరించుఁగాక- క్రోధము వహించుఁగాక- క్రోధంబు
కృతార్థత్వంబునంద నన్నేమిటికిఁ గండలు గండలుగ ఖండింపక విడిచి
పోవలయు? హా! ఘోరదురాశా వృతమా! నిన్నుఁబెంచినందులకుఁ
గట్టకడకు నాకువిషఫలమ్ముల నొసంగితివా? ఓ! సాహస పిశాచమా!
నన్ను సాంగముగ మ్రింగివైచితివా? ఓధైర్యపర్వతమా! నాశిరమున
గూలితివా! ఓదుర్విధీ! మొట్టమొదట నాకనముమీఁది,కెక్కఁజేసితు
ట్టతుదకు నన్నధోలోకమునకు ద్రోచివైచితివా! అక్కటకటా! చక్ర
వర్తిఁ జేయనెంచి హృదయేశ్వరుని సన్న్యాసిం జేసితినే! ఏమి? ఇప్పుడేమి
మించిపోయె? నానాథుంగలిసికొని విజయేంద్రమల్లుని, సంగతిఁజెప్పి
యాతని రప్పించి నీయిష్టమువచ్చినట్లు చేయుమన్న నానాథుఁడడవుల
కుఁబోవు దుర్గతియు నాథుని కొఱకు నేను గృశించుచచ్చుదుస్స్థితియు,
దొలంగిపోదా? అట్లేల చేయరాదు. ఛీ! ఏమిలాభము? విజయేంద్రుఁ
సింహాపీఠిఁ గూర్చుండఁ బెట్టి రాజ్యభారమేరిమీఁదనో మోపి దనకతం
బున నన్నయు వదినెయు గతించిరని నలువురిలోఁ దలయెత్తుకొని తిరు
గనేరక నాథుఁడెట్లును గావలకే పోవునుగాని యీపాపాత్మురాలిని మ
న్నించి నిల్చునా? ఇదియుంగాక, యిన్నికష్టములుపడి, యిన్నితంత్రము

వన్ని, యిన్ని హత్యలొనర్చి, యిన్ని పాపములుగావించి చెమ్మటలూడ్చి రక్తముగార్చి, క్రూరనరకమునకుఁ దలయొగ్గి, ఘోరగుప్తి కొడిగట్టి, తుట్టతుదకుఁ దిరిగి నానితసపు బ్రిమునకుఁ బండ్లగిలించుటయా? ఛీ! ఛీ! వలదు. వలదు.

ఆ॥ వె॥ ప్రాణవల్లభుండు గావలకుంబోయి
యనుభవింపఁగలుగు నందు స్వేచ్ఛ
ఇంకమిగులుకార్య మేఁదీర్పస్వాతంత్ర్య
మనుభవింతుఁదెల్లి యమరపురిని

ఛీ! హృదయమా! ఇంకనుమిగిలియున్న కార్యముఁదీర్ప నుద్దేశించుచుంటివా! ఏమిజాల్ముకొనెదవు?

సీ॥ ప్రాణేశ్వరుఁడు ఘోరకాననంబుల కేఁగ
నింకనీసామ్రాజ్య మెవరికొఱకు?
మన్మనోనాథుఁడు మైబూడిదనలంద
నింక నీ యైశ్వర్య మెవరికొఱకు?
నాహృదయేశుండు నారలుగట్ట నిం
కీహేమవస్త్రమ్ము లెవరికొఱకు?
కాంతుండు గూరలుగాయలు దిననింక
నీపాయసాన్నంబు లెవరికొఱకు.

ఆ॥ వె॥ ఎవరికొఱకొనర్తు నింకఘోరాఘమ్ము?
నెవరికొఱకుఁగార్తు, నింకరక్త -
మేదికిచ్చుదాన, నేగంగనిడుదాన,
నెందుగాల్చుదాన, నెల్లసిరులు? -

ఆత్మహత్య యే నామిగిలినకార్యము!

సీ॥ ప్రాణమానీపతి కానలకుం బోయె
　　　　కదలిపోవేగ యీకత్తివిడిచి
ఎందఱనో బలియిచ్చితిఁ జండికా!
　　　　యిచ్చెదనా ప్రాణమిపుడు గొనుము.
దైవమా! క్రూరస్వభావమా! నాయాశ
　　　　లెల్లమ్రింగితిమింగు మిదిగొనన్ను
లోకమానిందింపఁ బోకుమత్పతిభక్తిఁ,
　　　　చెనఁటిచెయ్వులను దూషింపుగాని –
గీ. పురగిరి క్షత్రియాన్వయ భూషణ! విజ
యేంద్ర! పురగిరిఁ జింతలేకేలుకొమ్ము
నీదు మృత్యువు మృత్యువున్ జేరుచుండ
రమ్ము ఖడ్గమా! ఏొఱ నాయుస్థ్సలమ్ము,

(పొడుచుకొనఁ బోవుచుండ దటాలున ధీరమల్లుఁడు ప్రవేశించి ఖడ్గము లాగుకొనును. సాయుధులగు మఱికొందరు భటులు ప్రవేశింతురు)

చండి—ధీరమల్లుఁడా! నీవింకను బ్రతికియుంటివా!

ధీర—చండికాసాన్నిధ్యమున-అప్పుడు నిదియేమాటఁ జెప్పితిని

చండి—మీాతంత్రములన్నియు నెఱింగితిని—ప్రతాపమల్లుఁడు నీలోఁ జేగినాఁడు.

ధీర—ఇప్పుడందఱును జేరినారు. యుద్ధముతోఁ బనిలేకుండనే కోటమావశమైనది.

చండి—ఏమి? నాభటులవంచించి నీలోఁ గలుపుకొంటివా!

ధీర—మొదటనీవు చేసినపని యదియేగదా! అయిన నీ కార్యమునేఁజేసినది కాదు. నీభర్త—విజయేంద్రమల్లుని కొఱకే యుద్ధమని యతఁడు దెలిసికొని సైనికుల మాపక్షమవలంబింపఁజేసి కోటరహస్యములు దెలిపించి మమ్ముఁ బ్రవేశపెట్టి దాసరణ్యములకుఁ బోయినాఁ

దు. అతఁడు తెలిపింపకున్న మేమే తెలిపించి యుందుము.

చండి—హా! పైవిూఁది బట్టయే పాము కఱచినది. ఏమి? అతఁడు దెలిపింపకున్న విూరే తెలిపించియుందురా! నాసేనల మూయించి కోటలోఁ బ్రవేశించియుందురా! హా! ఆసాభాగ్యమును గనఁ బఱచియుంగును. నాయదృష్టము చాలకపోయెను. నాదుర్విధియడ్డుదగిలెను. ఓబుద్ధిమంతుఁడా!

శా. ప్రాణేశుండు ననుందిరస్కృతి యొనర్పం బూన్కిఁ బోనాడితిన్
గానీ! యేన కృపాణిఁ బూని యలసంగ్రామస్థలిం ద్రొక్కనన్
సేనల్ మక్కెనె? కోటచిక్కెనె? జయశ్రీదక్కనే? యింతమా
త్రానం గాల్వలు నేళ్లు వార్థులయి రక్తంబుర్విఁ జాల్వాఱకే.

ధీర—ఆసాభాగ్యము నీకులేదు ఇదిగో! సంకెలలసాభాగ్యము— (భటునిచెంతనుండి తీసికొని) నేనన్నపరుసవాఁడను గావనేనే సంకెలలు వైతును - (చండికచేతులకు సంకెలలుదగిలించును)

చండి—ధీరమల్లా! నన్నేమిచేయం దలంచితిరి?

ధీర—విజయేంద్రు నడుగుము

(ప్రవేశము - విజయేంద్రుఁడు. ప్రతాపమల్లుఁడు - వీరమల్లుఁ డు సైనికులు)

విజయేం—అమాత్యచంద్రా! ఇది యేమి?

ధీర—విూతల్లిగారికి విషమొసంగిన చేతులకు, విూతండ్రిగారి తలఁగొట్టిన చేతులకు నివితగవా?

విజయేం—తగవు -

గీ॥ తల్లిపిన్నటఁదల్లియుం [illegible] యూమె
కరములకు సంకెలలువై [illegible] నుంచి
పఁగిరీటముఁదలఁదాల్చి యే [illegible] న
సింహపీఠినిగూర్చుండ సిగ్గుమాలి?

ధీర—త్రాఁచు పాముతోఁ బగఁబెట్టుకొంటయే తగదు - ప బెట్టుకొన్నఁ బ్రాణములతో విడువరాదు.

విజయేం—మంత్రిచంద్రా! గాడిలిగలసిపినఁగాని నాకుర

వ్రాతలేదా; అయినను నాకు రాజ్యమే వలదు -

చండిక—విజయేంద్రమల్లా! నీవు నాకు మరణదండనము విధింపనిచో నేనే యాత్మహత్యఁ జేసికొందును -

గీ॥ మట్టుపెట్టితి బావను, బొట్టఁ బెట్టు
కొంటి నప్పను, భర్తను ఘోరగహన
ములకు గెంటితి, నింతటి కలుష మెట్టు
లాత్మహత్యనుగాకీఁగు టవని నేను -

విజయేం—అమ్మా! ఆత్మహత్యను జేసికొందువా! వలదు తల్లీ! వలదు -

సీ॥ కసిగందు వీఁడంచుఁ గనికరం బెదలేక
తల్లియుఁ ద్యజియించెఁ దండ్రి విడిచె
అడుగులంటి బ్రతిమిలాడుకొన్నఁగాని
పినతండ్రి పిన కటువకినీఁ జోయె
కన్నయ్యఁ గన్నమ్మఁ బిన్నయ్య యున్ లేని
దిక్కుమాలినయట్టి దీన వీని
నీవేని యుఁకా నిల్పి పోవరాదే తల్లి!
యేమిటికిం గతియింపవలయు?

ఆ॥ వె॥ తల్లిదండ్రి పిన్నతండ్రి పిన్నమ్మయు
నీవయుందు నెడఁద నెంచుకొంచు
అహరహమ్ము నిన్ను నమ్మా! యనుచుఁ బిల్చు
కొంచు నూఱడిలుచుఁ గొంతివఱకు.

చండి—నాయనా! పాముపిల్లను ముంగిస పెంచుటయా! మేకపిల్లను బెబ్బులి పోషించుటయా! నేనాత్మహత్య గావించుకొనట యే నీకు శ్రేయస్కరము - ఈసంకెలలు వదలించుము -

విజ—(తానే వదల్చి) అమ్మా!

చండి—నాయనా! చింతవిడువుము - ఈపిశాచి పోయిన నీకు సౌఖ్యము-(తటాలున విజయేంద్రునిచేతనున్న కరవాలు లాగికొని పొడుచుకొని) మలహర! మలహర! (పడిపోవును. అందరు హా! హా! యందురు).

లుహా!

వీ:—హా! హా! తల్లీ! (సుఖించును)

ధీర—వీరమల్లా! నీవీకుమారుని నిలిపితివి. అయిన నీకైలలో పట్టాభిషేకము చేయరాదు. తరువాత చేయవచ్చును. ముందుగ కిరీటము దలనుంపుము.

వీర—అయ్యా! నేనిల్పిన దేమి? మీరేయుంచుడు.

ధీర—(ప్రతాపమల్లునిచే నున్న కిరీటము విజయేంద్రుని శిరమున నిడును)

అందఱు—జయము—పురగిర్యధీశ్వరునకు జయము.

ధీర—విజయేంద్రా! ఆలు బిడ్డలఁగోలుపోయిన నాకింకేమున్నది. నేనడవులకుఁ బోయెద.

విజ—అయ్యా! మీరును బోయెదరా! నేనింత పెద్దవాఁడనగువఱకుండఁగూడదా?

ప్రతా—అయ్యా! సన్న్యాసులై యిదివఱకు పొందించిన కార్యము చాలదా! ఇప్పుడేమి సాధించెదరు

ధీర—నీసాహాయ్యమునఁ దాఁ? ఇప్పటివఱి సాయంబులేకుండ ముక్తినిసంపాదించెదను.

వీర—అమాత్యచంద్రా! విజయేంద్రమల్లుని వేడికోలును మన్నింపుము.

ధీర—మంచిది. అటులే కుమార విజయేంద్రమల్లుఁడు పెద్దయగు వఱకుండి తరువాతఁ గానలకుఁ బోయెదను. మనకిప్పుడు గావలసినదేమి?

వీర—మనయభీష్టము నెఱవేఱెఁ గదా? అయిన నిట్లగుఁగాక

గీ. ధర్మమునకు జయంబు నధర్మమునకు
నపజయంబొనఁగూడు గాక హాగహామ్ము,
జనుల బిడ్డలనటు రాజుగ నెడుఁగాక
అవనిపతిఁ బ్రజపితవోలె సగయుఁ గాక.

అందఱు—తథాస్తు! తథాస్తు! [యవనిక జాఱును

సంపూర్ణము.